

శ్రీ లక్ష్మీనృసింహ హరికథా గ్రంథమాల

స్థాపితము కన్నెపీఠః

చతుర్థ కుసుమము

# సీతా కల్యాణము

## యక్షగానము

సృష్ట్యాదిగతాబ్దాః

౧౯౫ ౫౮, [illegible]

కల్యాది

౫౦౬౦



శాలివాహన శకము

౧౮౮౧

వికారినామక

హాయనము

గ్రంథకర్త

హరికథా ప్రబోధకరత్న

## మార్తి వేంకటేశ్వరశాస్త్రి

వెల: 2—50

కవిత్వ చింతామణి, ఆంధ్ర హిందీ సుబోధిన్యాది గ్రంథకర్త
ఆంధ్ర వ్యాకరణాచార్య చదలవాడ కోటినరసింహంగారి
అభిప్రాయము.

———x———

# పరిచయము

శ్రీ సీతాకల్యాణ గ్రంథకర్తయగు శ్రీ మార్తి వేంకటేశ్వర శాస్త్రిగారిని గుఱించి పాఠక లోకమునకుఁ బరిచయ మొనర్పనెంచితిని.

కృష్ణాజిల్లా-నందిగామ తాలూకాలో "కన్నెవీడు" అను గ్రామ మొండుగలదు. అందు భూసురవరేణ్యులగు మార్తి లక్ష్మీనరసింహ శర్మగారు సంగీత సాహిత్యములందు అందె వేసిన చెయ్యి. వీరి సతీమణి లక్ష్మీనరసింహోపాసకురాలు - సీతారామమ్మగారు. ఈ దంపతులకు రుధిరోద్గారి నామ సంవత్సర భాద్రపద బహుళ చతుర్థి శనివారము నాఁడు వేంకటేశ్వరశాస్త్రిగారు జన్మించిరి.

ఈ శాస్త్రిగారికి 5 వ సంవత్సరమున అక్షరాభ్యాసము, 13 వ సంవత్సరమున ఉపనయనము - వైదికవిద్య, 16 వ సంవత్సరమున బ్రహ్మశ్రీ దుర్భాకుల విశ్వనాథశాస్త్రిగారికి లక్ష్మీనరసమ్మగారికిఁ బ్రథమ పుత్త్రికయగు హనుమాయమ్మగారితో వివాహము - 21 వ సంవత్సరమున సంతాన ప్రారంభము జరిగినవి. వీరి కింతవఱకు వరుసగా 1. రాజ్యలక్ష్మమ్మ 2. రామలింగశాస్త్రి 3. విజయభారతి 4. ఉగ్ర నరసింహము (ఇతఁడు మృతజీవి) 5. సరస్వతి 6. మేదిని 7. లక్ష్మీ నారాయణ అను సంతానము లభ్యము.

వీరు 17వ సంవత్సరమునుండి 25వ సంవత్సరము దనుక హాలిక [illegible] జీవించి, 26వ సంవత్సరమునుండి కథకులుగా గణన కెక్కి-[illegible] [illegible] కన్నప్ప చరిత్రతోఁ బ్రారంభించి, రామాయణ [illegible]

త్రాది పురాణేతిహాసములను బోధించి "హరికథా ప్రబోధకరత్న" అను బిరుదమంది విరాజిల్లు చున్నారు.

31వ సంవత్సరమున గ్రంథ రచనమునకు శ్రీకారముం జుట్టి, క్రమ క్రమముగా 1. లక్ష్మీనరసింహ నక్షత్రమాల 2. అనంత నక్షత్ర మాల 3. కర్మాబాయి చరిత్రము 4. వేంకటేశ్వర మహాత్మ్యము 5. ప్రభాకర శతకము 6. రామలింగేశ్వర నక్షత్రమాల 7. నృకేసరి శతకము రచించి, రామాయణ యక్షగానమును లిఖించుచున్నారు. అందలి ఘట్టములలో శ్రీ సీతా కళ్యాణ మొకటి.

రామాయణము కల్పిత కావ్యమను నానుడి ప్రముక్కుడులలో నొక్కడుఁ గలడు. నిక్కముం దెల్పియక, చిక్కులం జిక్కి, తక్కిన వారింగూడఁ బ్రక్కం జేర్చుకొని, అక్క డక్కడ నక్కి, నిక్కి, టక్కులాడు నాస్తికుల కీగ్రంథము తగిన శాస్తి.

రామాయణ కాల నిర్ధారణ మొనర్చిన ఈకవిగారి పాండిత్యము ప్రశంసాపాత్రము. ఈ గ్రంథమందలి పద్యములు హృద్యములు; మాటలు-పాటలు తేట తెనుఁగు నాట నాటుకొని పాటి కెక్కినవి. అరఁటి పం డొలిచి, నోటి కందింప, ఆస్వాదనమున కాలస్య మేల?

తప్పుః బట్టుట గొప్పతన మనుకొనుటఁగూర్చి యిటఁ గొంత వ్రాయుట వింత గాదు.

వన్నె కెక్కిని నన్నయనే మన్నింపక చిన్నపుచ్చుట కెన్నో పన్నుగడలం బన్ను నిన్న-మొన్నటి పిన్న వారల తెన్ను నేనెన్నఁడును సన్నుతింపను.

"తప్పులెన్నువారు తమ తప్పు లెఱుఁగరు-ఉర్వి జనుల కెల్లనుండుఁ దప్పు" అను వేమన పలుకుల కొప్పక, ఒప్పుఁ గప్పిపుచ్చి, చప్పున చప్పరించు వారెప్పుడైన ముప్పునఁ బడి, రొప్పి, తెప్పిటిల్లక తిప్పఁ దూలుట తప్పదు!

ఇట్లు,

భాషా సేవకుఁడు,

చదలవాడ కోటినరసింహము.

నందనామ
9-7-52

# శ్రీ గణేశ సర్వస్వాది గ్రంథకర్త
# చాగంటి భాస్కరలింగశాస్త్రిగారి
# అభిప్రాయము

—o—

శ్రీ శివాయ గురవేనమః

శ్రీ మూర్తి వేంకటేశ్వరశాస్త్రిగారు రచించు సీతారాముల చరిత్రమున సీతాకల్యాణమను యక్షగాన కావ్యమును చూచితిని. కావ్య రచనా కౌశలము, అందలి ధారాపటిమ అసాధారణప్రవాహము, అనన్యపదగంభీరము, వర్ణనాతీతము, ఈకావ్యము పూర్వకవుల శైలి తోనున్నది. అచ్చటచ్చట పోకడలు రసభావము రామరాజ భూషణ అడిదము సూరకవిని, అన్వేషించుచున్నవి. యీశాస్త్రిగారు ఇటువంటి రచనలెన్నో రచించి పాఠక లోకమున కందించి యశస్కాములై వర్ధిల్లుదురుగాకయని సదాశివుని గోరుచున్నాను.

ఇట్లు,

భక్త పాదరేణు

చాగంటి భాస్కరలింగశాస్త్రి

ఓరుగల్లు – 19–6–59.



శ్రీ భగవద్గీతా ప్రవేశ, చిత్రశతక, హిందూ మతేత్యాది

గ్రంథకర్తలును, ఆర్ష విద్యాభూషణ, బిరుదాంకితులగు

**బ్రహ్మశ్రీ జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ. గారి**

# అ భి ప్రా య ము

——x——

ఆర్యా!

మాంగళ్య ప్రదమైన మీ "సీతా కల్యాణ" గ్రంథము చూచినాను.

పవిత్రమైన విషయమును సులభ మనోహర భాషలో

నిబంధించినారు. సహృదయులెల్లరు

మిమ్మభినందింపగలరు.

(సం.) జటావల్లభుల పురుషోత్తము.

విజయవాడ, సత్యనారాయణపురం.

11 — 9 — 59

శ్రీ మహాభారత తత్త్వ కథన మాది గ్రంథకర్తలును

బాలవ్యాస, తర్క, వేదాంత, వ్యాకరణ కేసరీ బిరుదాంకితు లగు

## బ్రహ్మశ్రీ వారణాశి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి

## అ భి ప్రా య ము.

—o—

## శ్రీ "హరికథా ప్రబోధకరత్న" మూర్తి వేంకటేశ్వరశాస్త్రిగారికి

## ఆ శీ ర్వ చ న ము లు.

హరికథా రూపమున రచించు మీ సీతారామ చరిత్రమున

"సీతా కల్యాణ" మను భాగము మీరు పంపినది నాకు చేరినది.

చూచితిని. మీరచన బాగున్నది.

ఇట్లు

భవచ్ఛ్రేయోభిలాషి

(సం.) వా॥ సుబ్రహ్మణ్యశాస్త్రి.

శ్రీ రాజ్యలక్ష్మీ సమేత యోగానందనృసింహమూర్తయేనమః

# రసికుల కొరకు మనవి.

సృష్టికర్తయగు బ్రహ్మదేవుని యొక్క ద్వితీయ పరార్థము నందు ప్రథమ కల్పమునం గల పదునాలుగు మన్వంతరముల కాలములో స్వాయంభువ వాది ఆరు మన్వంతరములు గడచిన పిదప ఏడవది యగు వైవస్వతమన్వంతరము సంభవించెను.

ఈ వైవస్వతమన్వంతరము యొక్క కాలము డెబ్బదియొక్క మహాయుగములు. దీనిలో ఇప్పటికి, ఇరువది యేడు మహాయుగములు గతించినవి. ఇరువ దెనిమిదవ మహాయుగమున పదునేడు లక్షల యిరువ దెనిమిది వేల వత్సరముల పరిమాణము గల కృతయుగమును, పది రెండు లక్షల తొంబది యారు వేల సంవత్సరముల త్రేతాయుగమును, ఎనిమిది లక్షల అరువది నాలుగు వేల యబ్దముల ద్వాపర యుగమును గడచి, నాలుగు లక్షల ముప్పది రెండు వేల సంవత్సరముల కలియుగ మున ఇప్పటి కనంగా విళంబి నామక హాయనము ప్రారంభ మగు వఱకు ఐదు వేల ఏబ దెనిమిది వత్సరములు గడచి, ఏబది తొమ్మిదవ వత్సరము గడచు చున్నది.

గతించిన ఇరువది యేడు మహాయుగములలో నాలుగు మహా యుగములు గడచిన పిదప, ఐదవ మహా యుగమున వచ్చు త్రేతా యుగము ముప్పదివేల వత్సరములు శేషించి యుండంగా వచ్చిన విళంబి నామ సంవత్సర మందు గర్భధార ణాది ద్వాదశ మాస మగు చైత్ర శుద్ధ నవమి బుధవాసరము పునర్వసు నక్షత్ర యుక్త మధ్యాహ్న కటక లగ్నమున పంచగ్రహము లుచ్చ రాసి యం దుండ గురు చంద్ర యోగమున శ్రీ ఇక్ష్వాకు వంశ సంభవుం డగు దశరథ మహా రాజు జ్యేష్ఠ భార్య యగు కౌసల్యా మహాదేవి యందు జగ ద్రక్ష

ణార్థము శ్రీరామమూర్తి ఆవిర్భవించిన దాది రావణ వధానంతరము జరుగు పట్టాభిషేకము వరకుఁ గల కాల నిర్ణయ మొనర్చుటలో శ్రీయుతులును, మా మేనమామలును, పెనుగంచిప్రోలు గ్రామ నివాసులును, ఆగమవిద్యా విశారదులును, సకల శాస్త్ర పురాణేతి హాస పరిచయులును, యోగానంద లక్ష్మీనృసింహ గ్రంథమాలాధి కారులును, తపస్సంపన్నులు నగు శ్రీ భైరవభొట్ల సత్యనారాయణ శర్మ పాకయాజి గారును, వేంకట్రామేశ్వర శర్మ సోదరులు నాకు సాహాయ్య మొనర్చిరి.

శ్రీరామదర్శనీ పత్రికా సంపాదకు లగు శ్రీ కేశవ తీర్థ స్వాముల వారి ప్రియ శిష్యుండును, భద్రాచల వాస శ్రీరామచంద్ర మూర్తి పచ్చలపతకమును ప్రభుత్వము వారు గైకొన నుద్యోగించు తఱి లక్ష రూప్యముల నొసంగి, దానిని రాము వక్షమం దిడి, "ఖమ్మంమెట్టు" పట్టణమున "శ్రీరామభక్త గెంటేల నారాయణరావు కాలేజీ" యను పేర విలసిల్లు విద్యా భవనమునకు తోడ్పడి స్థాపించిన శ్రీ శ్రీ శ్రీ రామభక్త గెంటేల నారాయణరావు గారు సీతారాముల వివాహ చరిత్రము రచింపుము నే నచ్చొత్తించెద నను పలుకుతో

*పలికెడిది రాము చరితము*
*పలికించు నతండు రామభద్రుఁడు దానిం*
*బలికిన భవములు దొలఁగును*
*గలుగును సంపదలు భక్త గణమున కెపుడున్*

అను తలంపున రామాయణ యక్షగాన రచనమున కుపక్రమించితి.

గతమునం దనేకులు లిఖించిరి గదా? యను శంక కొందరికిఁ గలుగ వచ్చును. గతించిన దినమున భుజించిన భోజనమునే రెండవ దినమున భుజించిన చందమ్మున కల్యాణ గుణ గణాలంకారు లగు

సీతారాముల చరితము లెప్పుడైన వెగటగునా? భవసాగరముసుం
దరింపఁ గోరువారి రాముని కీర్తించుట కన్న మార్గ మెయ్యదియు
లేదు. గాన వ్రాయం బూనితి. నాచే లిఖింపంబడు ఈ సీతారామ
చరిత్రమున సీతా కల్యాణ మను భాగమును అచ్చొత్తించు
**శ్రీ రామభక్త గెంటేల నారాయణరావు గారిని శ్రీ** రామచంద్ర
మూర్తి కాలనిర్ణయ కార్యసహాయకులైన **శ్రీ భైరవభొట్ల సోదరులను,**
నాచే రచింపఁబడిన గ్రంథములను పరసముగ నచ్చొత్తి, పాఠక
లోకమున కందించుచున్న జగ్గయ్యపేట బాపూజీ ఆర్ట్ ప్రింటర్సు
ప్రొప్రయిటరు **శ్రీ కఠారి వేంకటరత్నము గారిని,** ముద్రణాలయమునం
బని చేయుచున్న వారిని సర్వేశ్వరుఁడు సర్వకాలముల యందును ఆయు
రారోగ్య భోగ భాగ్యముల నొసంగి రక్షించుఁ గాక!

నా కవితా మార్గదర్శకులు **శ్రీ చదలవాడ కోటినరసింహము
గారికి** శ్రీ రామచంద్రమూర్తి శీఘ్రముగా సత్పుత్త్రుల నొసంగి వం
శాభివృద్ధి నొనఁగూర్చి, వారి యశశ్చంద్రికల నీ ప్రపంచమునం
దాచంద్ర తారార్కముగ నిల్పి ప్రతిముహూర్తము శుభప్రదముగ
నొనరించుఁ గాక! నా యీ గ్రంథమున కభిప్రాయముల నిచ్చి, నా
శ్రేయంబుఁ గోరి నన్నాశీర్వదించు వారికిని, యీ గ్రంథమును పఠించి
ప్రజలకుబోధించు నా సాటి హరిదాసబృందమునకు నాయభివందనములు.

కన్నెవీడు
విళంబి వైశాఖ పూర్ణిమ
(నృసింహజయంతి)

ఇట్లు,
**గ్రంథకర్త.**





# కృతి సమర్పణము.



శ్రీరామ నామ మంత్రము
నారూఢిగఁ దలఁచు నట్టి ఆర్యా సతితోఁ
గూరిమితో వచ్చి కృతిని
ధారం బని యనకఁ గొనఁగఁ బ్రార్థింతు శివా!

శివ కేశవుల కభేద
మ్మవుటన్ కేశవ చరిత్ర మనఁదగు సీతా
ధవ చారిత్ర్యముఁ గైకొని
మిపులన్ రక్షింపు చుండుమీ! నన్ను శివా!

## కవి వంశావళి

ధాత్రిన్ మాత్రి వంశ ప్రవర్ధనుఁడు సత్కీర్తి యాత్రేయస
గోత్రుం డుత్తమ బుద్ధి రామ కవి తాఁ గూర్మిం గనుం గొప్ప సా
విత్రిం బోలిన శీలవం బరఁగు సాధ్విం శ్రీ మహాలక్ష్మికిం
బుత్రుం డైన నృసింహ శర్మఁడ దంభోజాక్షి సీతాంబకుం
బుత్రుండన్ గవి వేంకటేశ్వరుఁడఁ బొల్పుం గాంతు నవ్వారిగాన్.

## ఆంజనేయ స్తుతి

శంకరునంశజుండు, నవసారసనేత్రుఁడు రాముభక్తుడై
పంకజసంభవుం డనఁగ భవ్యులు మెచ్చఁగఁ బుట్టనుండి నా
వంక కృపన్ గనుంగొనెడి వానరనాయకు "డంజ" నాత్మజున్
శంకనుపీడి గొల్తు కవనంబున వ్యాకరణంబు పీయఁగన్.

## సుకవి స్తుతి

శ్రీకరుఁడైన రాముని చరిత్రము వ్రాసిన సత్కవీశు వా
ల్మీకికి మ్రొక్కి, వ్యాసముని మిక్కిలి స్తోత్రముఁ జేసి, నన్నయన్
బ్రాకటలీలఁ బల్కి, పలుభంగుల భక్తులఁ గూడి యుండి నే
నేకముగా నృకేసరిని వెంచి లిఖించెద రాము సత్కథన్.

## కుకవి నింద

రాముఁడు దేవుడా? యనెడి భ్రష్టులఁజూచి భయంబు జెందఁగా
నేమి, మరంద మానుచును భృంగము జెందదె సంతసంబుఁ, దా
గ్రామము పీడుచున్ గరికకై జను గార్దభ ముండె వంచు దా
నేమియొ పీడునాకృతము, నింక రఘూద్వహు కార్యమట్టిదే

# కృతి పోషక వంశావళి

శ్రీ జగ్గయ్యపేటలో ధర్మసత్ర నిర్మాణయు, భద్రాచల శ్రీరామ చంద్రమూర్తి పేర లక్ష రూప్యముల దానమిచ్చి ఖమ్మంమెట్టు పట్టణమున "శ్రీరామభక్త గెంటేల నారాయణరావు కాలేజి" యను పేర కాలేజిని గట్టించి నట్టియు, బీద విప్రులనేకులకు వివాహోపనయనములఁ గావించిన శ్రీరామభక్త గెంటేల నారాయణరావు గారి వంశావళి పద్యములు.



శ్రీకర మ్మాంధ్రదేశ విస్తృత తలమ్ము
అందు కృష్ణా జిల్లా ప్రతి భాకరమ్ము
దాన తక్కెళ్లపా డ్రప్రశస్తము సతమ్ము
భూసు రోత్తమ వాస ప్రపూరితమ్ము

రొక్కమును లెక్కకుం జిక్కమిం
తక్కెడలం బుంచి చూచు స్థల మది యనుటన్
తక్కెళ్ళపాడనం బడు
అక్కరములు సార్థకమ్ము లగును ధరిత్రిన్

అజుని ముఖమున నుద్భవ మైన యట్టి
బ్రాహ్మణులలో నియోగు ల న్వారు మిగుల
వినుతిం గన, వారిలోన ఆర్వేలవారు
సాటి లేనట్టి వార లీనాటి వఱకు

ఆరువేల వారె యనుకొనంగా లేల!
లక్షలం గడించి దక్షులగుచు
కీర్తి గాంచినారు గెంటేల వారలు
ఆరు వేల వారి నధిగమించి.

గంటు లేని వారు గెంటేల వారలు
వారి వంటి వారి వైపు గంటి
అనుట బూటకమ్ము గాదు గద యీనాటి
ఒకటి రెంటి రుజువు లుంట నిచట

జ్ఞానవర తాధ్యాత్మి కానంద మగ్నులు
నీతి కోవిదులు గెంటేల వారు
గ్రామ పాలన పరాక్రమ సమాన్విత శీవి
శాలురు, ఘనులు గెంటేల వారు
సంగీత సాహిత్య శాస్త్ర పరిజ్ఞాత
నిపుణులు, బుధులు గెంటేల వారు
సంస్కృతాంధ్రాంగ్ల భాషా పట్టభద్రులు
నేతలు, కవులు గెంటేల వారు

అట్టి గెంటేల వంశమ్ము నందు బుట్టి
దాన ధర్మంబులం జేసి ధరణి యందు

రాము కీర్తించు వేంకట రామరాయ
వర్యునకు సీతమాంబకు వరలె సుతుండు

దానం బిచ్చుల జేయఁగా వలయు నన్ ధర్మంబు బోధింపఁగా
నీ నారాయణరావు పుట్టె నన నెంతేఁ జెల్లు ధాత్రీస్థలిన్
దానిం గూర్చి ప్రబోధమును సలిపెడన్ ధర్మాత్ము లీ వాటికిన్
ఈనాఁడె విని వాని మార్గములలో నేగన్ శుభం బౌ గదా!

ఖ్యాతిని గోరి దాన నిరతిం గొంకకను సేయుచు నుందు రెందరో
ఊరెందు రాము సత్కృపనె నిచ్చిత మొప్పఁగఁ గోరుచుండి సం
ప్రీతి ప్రతిగ్రహీతను హరి! యని పిల్చుచు నాదరించు నీ
భూతల మందు నెవ్వరినిఁ బోల్పఁగఁ జెల్లదు వీని కీడుగన్

భారద్వాజస గోత్ర వర్ధనుఁడవై, భాగ్యంపు వారాశివై,
శ్రీరామా యను మంత్ర పూత మతివై, సీతాంబికా భర్తవై,
సారంబౌ శతకంబు రాము పయి సత్స్ఫూర్తితో నిల్పుచున్
ధారాళం బగు దాన పద్ధతులఁ దద్దన్ దెల్పు నారాయణా!

శ్రీరామ భక్తుఁడై సీ
తా రామ వివాహ గాథ తగ హరికథగాఁ
గూరుప్రమా! యనె గెంటేల్
నారాయణరావు ప్రథిత నాముఁడు ధరణిన్

అచ్చు కూర్పున కైన రూప్యమ్ము లిచ్చి
కృతిని పోషించి, మించి, సన్నుతి వహించి
రామభక్త గెంటేల నారాయణుండు
సద్యశోవంతు డగుత! దాశరథి కృపను.

---



# గణపతి స్తుతి

కల్యాణి - చపుత్ర

ప॥ నిన్నువినా నెట లేదు నను బ్రోవ నీరజాసన నుతా!—గణపతి!॥ని

అ॥ సన్నుతింతు మన్నింతు వనుచు నీ
కన్న దిక్కు లేక—బ్రోవుము నను వేగ ॥ని॥

౧ ఇష్టము తల్లుల వద్ద నుండి జల్ సుద్దులు పల్కెడి ముద్దు బిడ్డడవు
ఒద్దికతో నా కార్య సఫలంబు నొనరింపంగ వెనుకంజవేయకుము॥ని

౨ మూర్తి వేంకటేశ్వరశాస్త్రిని నా కర్త నీవె యనుచు నమ్మితిని ఓ
మూర్తివంత! కొక్కు తేజివాహా! కీర్తిగాంచు భక్తరక్షాదక్షత ॥ని॥



# సరస్వతీ స్తవము

మోహన - చ॥ త్రిపుట

ప॥ పరాకేల జననీ! వాణీ! ॥ప॥
నిరపరాధులను దరిఁ జేరి బ్రోవఁగ ॥ప॥

అ॥ సరసిజాసనుని రాణీ! నా సన్నుతు లందఁగ నరుదెంచఁగ నింత ॥ప॥

మి॥ కరయుగంబుసంధించి నినుఁగాంచ కరము మ్రొక్కుచుంటి శరణంటి
మఱపుఁజెంద నేల నలువకొమ్మ! మానకమ్మ! బ్రోవుమమ్మ! భక్తుడ నమ్మ॥ప॥

చరణము

మూర్తి వంశ సంజాతుఁడ రిక్తుఁడ మాననీయ! వేంకటేశ్వరాఖ్యుఁడ
కీర్తిఁ గాంచు కవిత సాగఁ జేయుచు గీర్వాణీ! అలికులవేణి!
కర్త నీవె యక్ష గాన రచనకు గానలోల! కవితాజన రంజని!
పూర్తి కరుణఁ జూచి నన్ను నేలఁగఁ బోలదే? రాగదే? వాదే? ॥ప॥

రవిచంద్రిక - ఆది

ప॥ నరకేసరి నను నరసి కృపనుఁగను సరస మతిని నిను సన్నుతించెదను॥న॥

అ॥ సరసిజ నయనా! సాధు జనావన! సన్నుతిఁ గొను మాప న్నివారణా॥న

చరణము

ఆర్తి నొంది బృందారక సంఘము కీర్తింపఁగ ప్రత్యక్ష మైతివే
కీర్తివంత! ధరణీ బృందారకుఁడ మూర్తి వేంకటేశ్వర



# గాధి సుతాగమనము

## కథా ప్రారంభము

కం॥ శ్రీరాముని జననంబును
ఆరూఢిగ శివుఁడు దెలుప, నామోదముతో
శైలజ కోరెను ప్రేమను
శ్రీరామ వివాహ కథను జెప్పం డనుచున్.

వ॥ అనిన పరమేశ్వరికి పరమేశ్వరుం డిట్లనియె

గీ॥ వినుము శాంకరి! శ్రీరామ విభుని కథను
జన్మ సార్థక మొసరింపఁ జాలి నట్టి
చరిత మిది తప్ప వే ఱొద్ది ధరణి లేదు
భక్తి శ్రద్ధల నాలకింపంగఁ జనును

కాపి - రూపకము

ప॥ గాధిసుతాగమనము వినఁ గలుగు నభీష్టార్థ సిద్ధి ॥గా॥
అ॥ సాధుజనావనుఁ డగు రఘునాథుని మనమునఁ దలఁచెడి ॥గా॥

చరణము

దశరథ పుత్త్రికులకు శ్రుతి ధర్మముల వశిష్ఠమౌని
విశదముగా వినిపించుచు వేవిధములఁ గొనియాడ త్రి
దశవరులను దృప్తిఁ జేయ దానవుల నశింపఁజేయ
శశిధరుఁడగు హరుని పగిది సాకేతముఁ గన వచ్చెడి ॥గా॥

ఉ॥ శ్రీరఘురాము పల్కులకుఁ జిత్తమటంచును లక్ష్మణుండు న
వ్వారలఁ గూడు నా భరతు బాటను శత్రుహరుండు నాటలన్
జారులఁ దల్లి దండ్రుల నవారిత సంతస వారి ధారలన్
భూరితరంబుగాఁ దడిపి పొందుచు నుండఁగ సర్వ సౌఖ్యముల్

ఉ॥ అంతట యోగమాయ ఋషి యైన కుశధ్వజు నాతి గర్భమం
దెంతయుఁ గార్య తత్పరత నెంచి ప్రవేశము నయ్యె, నయ్యెడన్
మంతనమం దనంతు నియమంబుల నెంచి సుపర్వనాయకుల్
చింతలు వీడి సంతసముఁ జెంద శుభంపు ముహూర్త మందునన్

మంజరి

ఈగతి మునినాతి గర్భమున నా యిందువదన వెలుఁగంది
ఆగమ పాఠము జనకుఁడు సేయఁగ నవతరింప ముదమంది

గీ॥ వేద పారాయణమ్ము గావించు తఱిని
దానవాంతకు కృపచేతఁ దనయ గలిగె
వేదవతి యని ఘోషించె విష్ణుపదము
సురలు దుందుభుల్ మ్రోగింపఁ జొచ్చి రపుడు

వ॥ అంత నా మానికాంత లా బాలికామణిం గాంచి

కాంభోజి - చతురశ్ర

ప॥ భళిరే! యీ వేదవతికి సాటేది?
కలుములజవరాలే —— కాంచెనె యీ రూపము! ॥భ॥

అ॥ చిలుక పలుకులను బోలినపలుకులు చిలువ రేని దులకించు వేణియును

చ॥ మలిన హీన కుందము లా పన్నులు మహా విశాలంబౌ నేత్రంబులు
గలిగి యున్న కన్నె సాటి నెన్నఁగఁ గానరా రనుచు జనులు పల్కి రిటు॥భ
తధిరి ధిరి తకుధిన్నత్తోం తధిరి ధిరి తకుధిన్నత్తోం తధిరి ధిరి
ధిన్నత్తోం త తకిటతక తకతరికిట తకుధిన్నత్తోం కిట

తక తక తరికిట తకుధిన్నత్తాం తా తకుధిన్నత్తాం తకు
ధిన్నత్తాం తకుధిన్నత్తాం తకుధిన్నత్తాం ॥భళీ॥

ఉ॥ ఆటల, పాటలన్, సఖుల యందలి ప్రేమను, విద్య నేర్పునన్
బోటికి సాటి లేరని సమూహములై సురమానులెల్ల నా
పాటము తోడఁ బల్కఁగను, "రామ" కుశధ్వజ మాని యింటిలో
దీటుగ విద్యఁ గైకొనుచు దీప్తినిఁ గాంచె వివాహ యోగ్యతన్

చం॥ చలమున నేర్చు విద్యలను శారదఁ బోలుచుఁ బెర్గుచుండి సం
చలన మొనర్చు నానదుల సైకత భూములఁ, విష్ణుభక్తిచే
మలిన విహీన పుష్పముల మాపు పూజకుఁ దండ్రి కిచ్చు నా
యలికులవేణిఁ గైకొనుట కై సుర లెందఱో వచ్చుచుండఁగన్

వ॥ కుశధ్వజుండు వచ్చు వారల కెల్లర కిట్లు బల్కఁజొచ్చె

ఉ॥ ఈ సుకుమార గాత్రి హరికే సతి గాని మఱెవ్వ రైనఁ గా
నీ సమకూర్ప నంచు ముని నిశ్చలతం బ్రతినం బొనర్పఁగా
నీసున కొందఱు ద్విజుని కిట్లఁడే తగు దీని కంచు లో
రోసము వీడి కొందఱు సరోజ విలోచన వీడి యేగఁగన్

చం॥ కలుష భయమ్మునన్ జటిలు గాంచు భయమ్మునఁగొందఱేగఁగా
సులువుగఁ గాంతలం దలఁచు శూరులు రాక్షసు లౌట దంభుఁడన్
తులువపు మార్గ వర్తనుఁ డధోగతి కేగుదు నంచు నెంచకే
పలుకులఁ దేనె లొల్కు సతి బంధుర ప్రేమను గోర మానియున్

వ॥ దంభునిఁ గాంచి యిట్లనియె

ఉ॥ నల్లని మేను, పద్మ నయనమ్ములు, సోముని గేరు మోము, గో
మెల్ల దిశల్ వెలుంగ మెఱపించెడి కుండల యుగ్మముం, జగం
బెల్లను మోహ వారినిధి నింపు దలిర్పఁగ ముంపఁ గల్గు నా
చల్లని చూపుల న్వెలుగు చక్రి కొసంగి ఫలంబు నందెదన్

వ॥ ఇట్లు కుశధ్వజుండు పలుక నక్తంచరుం డప్పటి కరిగి కొంతవడికిఁ
దిరిగి వచ్చి, కుశధ్వజుని డాయం జని

విజయనాగరి - చ॥ త్రిపుట

ప॥ మునికుల తిలకుని నిశ యందునఁ గని
మూర్ఖుం డగు దంభుం డపి వెసఁ గొని

అ॥ తనువు మఱచి నిదురించు సమయమున
అనుమానం బిసుమంత లేక శిక్షఁ

చ॥ గొని దునుమాడెను కంకము ధర్మంబును
పలువిధముల పలవింపను ము
క్తినిఁ గొన నాశ వీస మేని లేక దుష్కీర్తి
యుతుం డధర్మ వర్తనుండై ॥ముని॥

కం॥ అసువులు వీడెను జటిలుఁడు
అసుసుండు గతించె బ్రహ్మహత్యను నపుడే
కుసుమాయుధుజనకుఁడు నీ
కు, సుత! గతి యని మునిసతియుఁ గోల్పడెఁ బ్రాణిన్

మ॥ తలి దండ్రుల్ జనిసంత వేదవతి యా దైవంబె దిక్కంచు, బా
పలు, నాకాధిపుఁ డాది స్వర్గులు విభ్రాంతిం గడుం జెందఁ జే
తులు గీలించుచు శౌరి నమ్మికను లో దుఃఖమ్ముఁ బోఁద్రోలుచున్
సలిపెన్ గేశవుఁగూర్చి తీవ్ర తపమున్ సాంద్రంపు ధైర్యంబునన్

ఉ॥ వెన్నెలఁ జిల్కు నవ్వు, శశి వెంపు హసింపఁగఁగల్గు మోము,నా
కన్నియ నిల్పె సూర్యునకు,కాంతి యుతంబగు కన్నుఁదోయిఁ, బెం
పెన్నికఁ గన్న యోగమునకే నిలయం బొనరించి, విష్ణువున్
సన్నుతిఁజేయ "రావణుఁడు" నాతినిఁ గాంచి భ్రమించి యిట్లనెన్

ఉ॥ ఎవ్వని పుత్త్రివో! తపము నేకతతో నొనరింప నేలకో!
జవ్వని కోర్కె లేమొ! నెఱజవ్వన మంతయు వమ్మొనర్పఁగా
ని వ్వనభూమి నుండఁ గత మేమొ! జనించు ట దెక్కడో! మనం
బెవ్వనిఁ గోరి యుండెనో! గ్రహింపఁగ నేగెద నంచు దైత్యుడున్

ఉ॥ కాంచితి దేవ కామినులఁ, గాంచితి యక్షుల, సిద్ధ సాధ్యులన్
గాంచితి, నాగ కాంతలనుఁ గాంచితి, మానవ సంఘ మందునం
గాంచితి సుందరాంగులనుఁ, గాని! మ హాద్భుత మైన రూపముం
గాంచఁగ నైతి, నే నిచట కన్య లభించుట యెట్టులో గదా!

మంజరుఖ

అని యెంతయొ చింతింపుచు మనమున సద్భుతంబు బుడిగొలుపన్
అనుమానం బిసుమంత లేక చనె నాసతి పైఁ గల వలపున్
దాపున కేగియు నిలచి యుండె నా దశవదనుఁడు ధృతి మించి
శ్రీపతి! యని తప మొనరించు సుదతి శ్రీఘ్రమె దృష్టిని విడచి
కర మరుదుగ తన హృదయ పీఠమున కామజనకు నెస నిలిపి
అరుదెంచిన యా రావణాసురున కతిథి పూజలను సలిపి

వ॥ నిలచి యుండ నరి భయంకరుం డగు రావణాసురుండు.

శహన చతురశ్ర

ప॥ కన్నెమిన్న! నీ తెఱ గంతయు వినఁ గలిగెను .
మనమున వినఁ దెల్పుమి ఓ ॥క॥

అ॥ మిన్నకున్న ఫల మేమిటో? అబల! మేలు గలుగు నీ కత లెల్లఁ దెలుప

చ॥ మిన్న యైన తప మేల చేసెదవు కన్న తండ్రి విడి యటవి వసింతువు
అన్నుమిన్న! నీనామ మెఱిఁగింప నందఁగలను యానంద మెంతయును॥క॥
తద్ధితాహతజంతరి ది తాహతజంతరి తాహతజంతరి తరా ధణా
జెణూ తా త్తరుగుడుతోం తా త్తరుగుడుతోం తా త్తరుగుడుతోం॥క

వ॥ ఇట్లు పలుకుచున్న దశవదనునకు వేదవతి యిట్లనియె

గీ॥ వేదవతి యను ననుఁ గాంచి విబుధవరులు,
దానవులు పెండ్లి యాడఁగాఁ దలఁచు చుండ
నాదు పిత కుశధ్వజుఁడు జనార్దను నకు
న న్నొసంగి తరింప స్వాంతమ్మున నెంచి

కం॥ హరి కే నొసఁగెద తనయను
మఱి నేరికిఁ గూర్ప ననుచు మఱి మఱిఁ బలుకన్
కర మాగ్రహించి దంభుఁడు
కరవాలము చేత జనకు ఖండింపంగన్

కమాచి - ఆది

ప॥ తపముఁ జేయు చుంటి దైత్యారిఁ గూర్చి ॥త॥
అ॥ కృప తోడ సద్గతి కేగఁగాఁ ॥దప॥

చరణము

హరియె దక్క నా గతి వేఱు లేదు
అసురవర్య! నా చరిత మిద్దియే
మి॥ సరగున నీ వరిగిన నే తపమును సారసాక్షుఁ గూర్చి చేసెదను నిశి
చర! నామనవిని విను, మేలునుఁ గను,
పరమునను, గనుఁగొను, హరిని, మది ॥త॥

వ॥ అనిన నా రావణాసురుండును.

తోటకవృత్తము

హరి యంచుఁ దలంపఁగ నా నోరా! నీ
గురుఁ జంపిన పట్టునఁ గోరఁగ ప్రే
మ రమావరుఁ డైనను మన్ననచే
కరుణించెనె? తెల్పుము కన్నియరో!

శా॥ కైలాసంబుఁ గదల్చి యా శివున కేఁ గై సేయ సంతోషియై
మేలౌ నంచు నొసంగె ఖడ్గమును, యో మీనాక్షి! లోకంబులో
లీలాత్ముండను నేనె గాన సురలున్ రేకొన్న ప్రేమంబునన్
వాలాయంబుగఁ గొల్చుచుందురు గదా పద్మాక్షుఁడున్ దేవుఁడా?

కం॥ హరి యన మండూకం బగు,
హరి యన నశ్వంబు నౌను, హరి కేసరి యౌ
హరి యన మర్కట మందురు
హరిమధ్యవు నీవు, నేనొ? హరిబలుఁడ సుమా!

వ॥ అని పలుకు రావణాసురునిఁ గాంచి వేదవతి యిట్లనియె

కం॥ కులువ తనంబున దేవునిఁ
బలు విధములఁ దూరు నట్టి భ్రష్టులఁ గని పే
నుల నిడి యూరక విను పె
ద్దలదే తప్పని "యనంత" ధర్మము పలుకున్

వ॥ అని వేదవతి పలుకఁ, గైకేసీ నందనుండు కామోద్రేకంబునఁ గన్నుఁ గానక నా కన్నియం గాంచి.

దేవగాంధారి - చతురశ్రజాతి

ప॥ మరుఁడు విడచు సుమ శరముల తాకున
కరగి పోయె నా హృదయ ఫలకంబు

అ॥ సరగున నీ యక్కున ననుఁ జేర్చుచు
సల్లాపంబులఁ దన్పవె యో యబల! ॥మ॥

చ॥ విరివి యైన నీ వేదాంతంబులు వినఁ జాలను, వీడఁగాఁ దగునె? శ్రీ
కరమగు నీయాకారమున్ బోలి గానరాదు, వీడఁలేదు,ని న్మది ॥మ॥

వ॥ అని కాము యక్కరులఁ జిక్కికొని మాటాడు నక్తంచరునిఁ గాంచి, యో పౌలస్త్యా! శ్రీహరి మహిమంబుఁ జెప్పెద వినుమని

ఉ॥ ఒక్కట సృష్టిఁ జేయుచు మఱొక్కటఁ బెంప, హరింపఁ గర్తయై
యొక్కఁడె వెల్గు శ్రీహరిని నొప్పిదము న్విడి దూఱ నెంచఁగా
నెక్కడ మానసంబు విడి తీవు రమావరుతో విరోధమే!
యు క్కడగింపఁడే? సురల న్యూనతఁ జూచెడి యాతుధానులన్

వ॥ అదియునుం గాక నా నిశ్చయంబు వినుము

కం॥ నామది శ్రీహరి కొసఁగితి
నో మలినాత్మ! చను మింక నోజన ననుచున్
సామజ యాన తొలంగఁగ
కోమలితో నిట్టు లనె నకుంఠిత గతితోన్

మంజరి

ఓ బాలా! సరిలేరు నీ కవని నుద్భవించు కోమలులన్
నా బాధలు గనకున్న జీవములు నన్ను విడుచెు స్థిర మగుతన్

వ॥ అనుచు మితిమించిన వ్యామోహంబున

చం॥ పెదవిని చప్పరించి, తన పెంపుఁ దలంపక, "పద్మనేత్ర! నన్
సదయతఁ గాంచు మన్మథుని సాయక ఘాతల కేను సాక్షితిన్
ముదము దలిర్ప నీ యధరమున్ జవిఁ జూచినఁ గాని ప్రాణముల్
కుదురుకొానంగఁ జాల" వని కోమలి వేణినిఁ బట్టె దైత్యుఁడున్

చం॥ తునియలు గాగ వేణి, సతి. దుర్మదుఁ గాంచుచుఁ బల్కె నిట్టు లే
మనియెద! రాక్షసుండ వని యంతయు నేను నెఱింగి స త్తపో
ధనుఁడగు నీదు తండ్రి నెద తథ్యముగాఁ దలపోసి పూజలన్
జనవునఁ జేసి నందులకు జక్కని మార్గమునం జరించి తే!

ఉ॥ ఓరి దురాత్మ! విష్ణునకె నొప్పిద నా గతిఁ బ్రాణ మర్థముల్
కూరిమి నిత్తు నేని నిఁకఁ గోవిద లోకము సంతసింపఁగా
మా రమణీ మనోహరుఁడు మానస వీథిని న న్గొానంగఁ దాఁ
గోరుట నిక్క మేని నినుఁ గూల్చుట కేను జనించెదన్ ధరన్

మ॥ ధరణీ గర్భమునం జనించి హరి కే తథ్యంబుగా రాణినై
హరివైరిన్ సుత సోదరాళులను నుద్యల్లీలఁ జంపించు టే
ధర సత్యం బని పల్కి వేదవతి నిర్దాక్షిణ్యయై యగ్నిలో
జొర నా నిర్జరులెల్లఁ బూ ల్గురియ నా చొప్పున్ విచారించుచున్

వ॥ దశవదనుండు గత కార్యంబునకుం జింతించుచున్న యశరీర వాణి
యీవాక్యంబు లెల్ల యథార్థంబులని పలుక గడుంగడు వగచి
లంకాపురంబున కరుగ నొక్కనాఁడు.

కళ్యాణి - త్రి - త్రిపుట

ప॥ వేదవతి హుతాశనుం గలిసి వేగమే లంకాధిపుం దలఁచి

అ॥ శ్రీదయితు హృదయంబున నిలిపి యాదిరూపము రావణున కొగి

ఖ॥ సాధుతనంబునఁ జూపింపను సరసత సరసున కమలంబుతో
ఆదిమ వాసము నాడి యనఁగ నవతరించె కన్నె రూప మందుచు॥వే॥
తద్ధిత్తాం తదిగిణతోం । తద్ధితకతాం । తదిగిణతోం
తద్ధి తకదికతోం । తదికిణతోం । తతోంతా । తదికిణతోం
తదికిణతోం । తదికిణతోం ॥వే॥

వ॥ ఇట్లు లంకాపురి నుద్యానవ నాంతర్గత సరస్సున నవతరింప రావణుండు

చ ర ణ ము

నియత చిత్తము తోడ రాక్షస నేత యేగి కొలంకు నందున ను
దయ మందున తమ్మి విరులను ముదమున జిదుమంగ నందున
నయమార్గిణి యైన వేదవతి నందుఁ గాంచి చింతించుచుఁ దా
స్వాయముగ గురువనుఁ బిలిపించుచు సత్యంబును వినుపించుచు నిలచిన ॥ని॥
తత్త్రకిటతక తకతరికిట తాకిటతక తకతరికిట తత్తకిట
తక తక తరికిట । తాతదిగిణతోం । తాతదిగిణతోం । తాతది
గిణతోం ॥నియ॥

వ॥ శుక్రుండు శిష్యునిం గాంచి

కం॥ తామసి, తా మసి యగుఁ గద,
తామస మందంగ నేల, దైత్యేశ్వర! యీ
నా మాటలు విని, యెంచుము
ఈ మానిని మందసమున నిప్పుడె పనుపన్

మ ం జ రు లు

ఇప్పుడె దీనినిఁ జంపిన తప్పక ముప్పు గలుగుటే గాదు
యెప్పటికైనను నిట కేతెంచిన నిదియె ఫలితమ్ము గొందు
అని పలుకుచు శుక్రుఁడు కూర్చుండఁగ నసురవరుఁడు మదిలోన
మునుముం దెటు గడచునో యని యోచనమునుఁ జేయుచు ధృతినూన

చం॥ గురువరుఁ డాడు వాక్యములకుం, గతమందునఁ గాంతపల్కులున్
సరి యగు టెంతయో మది నిశాచరు డచ్చెరు వంది, దూతలన్
సరగునఁ బిల్వనంపి, సతి సంభ్రమము నందున మందసంబులో
నరమర లేక యుంచి విడ నొ నని పల్క భటాళి యంతటన్

సీ॥ పట్టి పెట్టెను బెట్టి గట్టిగా బిగ గట్టి
యట్టె వైచిరి వార్ధి నసురు నాజ్ఞ
సంద్రు డంతట మహా సాంద్రతరం బైన
యానందతన్ సన్నుతాంగి పుత్రి
యన్న రీతిని బ్రోసె, మిన్నేటి తరఁగ లా
యన్ను మిన్నను గట్టు నందుఁ జేర్ప
రత్నగర్భ యనంగ రాజిల్లు భూదేవి
గర్భ మందునఁ జేర్చెఁ గన్య నంత

గీ॥ సంత తానందమయ మూర్తి సాధువర్తి
సుగుణగణ పూర్తియయ్యె నా శుకమహర్షి
ఎవని బోధనఁ గోరె నా యవనివిభుని
భూమి యందున నిలిచె నా పూవుఁబోఁడి

మం జ రు లు

కొంతకాలమున కా జనకున కొక కోర్కె మదిని జనియించి
దంతివరదు కరుణను గోన నెంచియు తాపసులను బిలిపించి
సవన విధానం బెరిఁగింపుఁ డంచు సన్నుతించు జనకునకు
అవిరళముగ ధర పరిశోధనమును నాచరింపుఁ డని పలుకు
భూదేవుల యాజ్ఞను గైకొని యా భూవరుండు కుతుకమున
శ్రీదేవుని దలఁచుచు మంత్రులతోఁ జేరె నొక్క క్షేత్రమున

వ॥ ఇట్లొక్క పరిశుద్ధ ప్రదేశంబుఁ జేరి

చం॥ జనక ధరాధినాయకుఁడు చక్కఁగ భూ పరిశోధనంబుఁ దా
ఘనముగఁ జేయ మందసము గన్పడె నాగలి తాఁకు చేతఁ దా

నినిఁ గొని జేర్చి రంత సభ నేర్పరు లెల్లరు నిర్మలాత్మ నా
జనకుఁడు విచ్చి చూడఁగను సారసలోచన యుండె పేటికన్

గీ॥ "అమ్మ! నీ వెవ్వరో! తెల్పు" మన్న బాల
చనుచు పుత్త్రిక నే నీక జనకునకును
ధరణి కంచుఁ దెల్పి యా తలిరుఁబోఁడి
చేరె నాజనకుని గృహసీమ కపుడు

వ॥ నాటనుండి యా కన్యారత్నంబును సీరాగ్రంబున జన్మించుటచే
సీత యను నామంబున జనకుండు పెంచుచున్న నా జగన్మాత
శుక్లపక్ష శీతకరుని పగిది నీగతిఁ బెరుగు చుండె

సీ॥ కోసలాత్మజపుత్త్రి కోర్కెలు బెరుగంగ
సీత దేహాపుఁ గాంతి శ్రీ వెలింగె
సాకేతపుర వాసు శౌర్యంబు పెరుఁగంగ
జనకపుత్త్రి మనంబు చంచలించె
భరతాగ్రజుని యందు మనప్రేమ ప్రబలంగ
భూపుత్త్రి చనుదోయి మొలక లెత్తె
దశరథ సూనుఁ డుద్యానమ్మునకు నేగ
మైథిలి చెలులతో మాట వీడె

గీ॥ పంచ శరు గురు హృది ప్రేమ భరిత మైన
పద్మవాసిని మది రాగ భరితమయ్యె
నిట్లు రాముండు సీతయు నింపుమీరఁ
బెరుగు చుండంగ, మిథిలలో తరుణి సీత

ఉ॥ దాఁగిలి మూఁత లాడుచును దాఁగిన వారల నెల్లఁ గాంచఁగా
మూఁగుచుఁ జెల్మికత్తియలు భూజకుఁ గన్నులు పెద్ద వంచు నిం
కేగతి నాట లాడఁగగు నీ దొర బిడ్డను వీడ నాటలున్
సాగు నటంచు మైథిలిని చయ్యన వీడిన సీత మాతతోన్

ఉ॥ అమ్మరొ! నాదు నేత్రయుగ మబ్బుట లేదఁట కేలు దోయికే
నిమ్మగ మూయ, దేహమున నేదొ యొకానొక కాంతియంట, ఓ
యమ్మ! యికెట్టు లాటలను నాడుదు, వారలు పిల్వరంట సా
యమ్మగ నేరి నైనను సహాయముఁ జేయు మనంగఁ దల్లియున్

మం జ రు లు

చెలిమికత్తియలఁ బిలిపించియు నా చెండ్లాటల నాడింపన్
కలుములజవరాలి చేతి చెండును గట్టిగా విసరి పనుపన్
శంకరు కార్ముక మున్న మందసము సందు చెండేగి నిలువన్
శంక వీడి భూజాత వామహస్తంబున దీయుచు మెఱసెన్

వ॥ అంత నాజనకుండు దానిం దిలకించి

ఉ॥ ఎంత విచిత్రమాయె, సుత యేవిధి యీ ధను వెత్తఁ గల్గె, నే
నెంత తపం బొనర్చితినొ? యేగిన జన్మము లందు, జన్మమున్
జింతనఁ జేసి నంతటనె చిన్నది మందస మందు నుంటచే
నెంతొ తరింపఁ గల్గు దిన మీవిధిఁ గల్గె నటంచు భూపుఁడున్

ఉ॥ ఇంత బలంబు గల్గు సుత కెట్లు లభించును భర్త, కల్గెఁబో
నింతకు మించు శౌర్యమును, నింపగు రూపము, ధైర్య సంపదల్
నెంతయొ సాహసంబుఁ, దగు నీడునుఁ గల్గుట దెట్లు? దోఁచె నా
మంతన మందు కార్యమును మానిత మా ప్రతినం బొనర్చెదన్

కం॥ శంకరు ధను వెక్కిడఁగా
శంకను విడి యేరి కైన సరసిజనేత్రన్
బంకజనాభుని సాక్షిగఁ
బొంకముగాఁ బెండ్లిఁ జేతు బుధులు నుతింపన్

వ॥ అని జనకుండు మనంబున నిశ్చయించి

పూరికల్యాణి - రూపకము

ప॥ చాటఁజేసె స్వయంవరమును సౌమ్య మాఘ మమావాస్య యని॥

అ॥ చాటుట విని బోటినిఁ గొన మేటిరాజు తెల్ల మదిని

మ॥ హాటకచేలునిఁ దలఁచుచు గాటపు ప్రేమనుఁ దెలుపుచు
నాటిరేయి బోటికవి మహాటవిఁ దాటుచు రాఁ ॥చాటు॥

చ ర ణ ము

జనకుఁ డంపు కరపత్రములను జదువుచు ధరణీధవు
లనువుగ సామంతులతో మునుకొని మిథిలానగరము
కనులు గల్గు ఫల మంతయు ననుభవించుచుం జూడఁగ
ధను వెక్కిడి యాకన్యనుఁ గొను వాఁడను నే ననుచును ॥జ॥

వ॥ ఇచ్చట కృతంబు లిట్లుండ, సిద్ధాశ్రమంబున, విశ్వామిత్రుం, డమం
దాయ మాన మానసుండై, డెందమం దాలోచించి, నా సంకల్ప
కార్యం బింక సఫలం బౌనని, రామ నామంబుఁ బాడుచు

అఠాణ - ఖండగతి

ప॥ అరుదెంచె గాధేయుఁ డయోధ్యా పురమునకు
మురవైరి చరణాబ్జములు మదినిఁ దలఁచుచును ॥అ॥

అ॥ మురియుచును నట దూత నరసి నృపతికిఁ దెలుప
విరచితంబుగఁ బనుప, నెఱిఁగింప, దశరథుఁడు

మ॥ సరగునఁ గొని పోయి మురిసి పీఠ మిచ్చి
బరువడిఁ బూజించి కరములు ముకుళించి ॥అ॥

చ ర ణ ము

మాదు జన్మ తరించె మ త్కృత కలుషము లుడిగె
మీదు దర్శనముచే మిగుల ధన్యత గలిగె
ఓ దేవవేద్య! నీ కొప్పిదం బదియేమొ
సాదరంబుగఁ దెలుప సన్నుతించెదఁ గృపా
పాథోధీ! యన మునివరుఁ డానందమునన్
సాదర మతి తోడన్ భూధవు దీవించెన్ ॥అ॥

౧ తకిటఝుం । తదికిణతోం । తదికిణతోం । తదికిణతోం ॥అ॥

౨ తద్ధితకిటజాం । తదికిణతోం । ధి తకిటజాం । తదికిణతోం ।
తకిటజాం । తకతదికిణతోం । తకతదికిణతోం । తకతదికిణతోం॥అ॥

౩ తాహతజంతరితాం । తజంతరిత్రాం । తరితతకుతాం । ధిరిధిరి
తకుదిన్నతాం । ధిరిధిరితకుధిన్నత్రాం। ధిరిధిరితకుధిన్నతాం ॥అరు॥

# గద్య

శ్రీ రాజ్యలక్ష్మీ సమేత యోగానంద నృసింహ మూర్తి కరుణా కటాక్ష
వీక్షణా లబ్ధ సహజ కవితా ధురీణ ఆత్రేయస గోత్ర, ఆపస్తంభ
సూత్రాంతర్గత మూర్తి వంశ పయః పారావార రాకా
సుధాకర రామలింగేశ్వర శాస్త్రి పౌత్త్రి లక్ష్మీనృసింహ
శర్మ సీత రా మాం బి కా పుత్త్రి హా రి క థా
ప్రబోధక రత్న వేంకటేశ్వర శాస్త్రిచే రచింపం
బడిన శ్రీ సీతా రామ చరిత్రంబను యక్షగాన
ప్రబంధంబున సీతాకల్యాణ. భాగమున
గాధిసు తాగమన మను కథ
సం పూ ర్ణ ము.





# అహల్యా శాపవిమోచనము

దేశగాంధారి - ఖండగతి

ప॥ శ్రీరామ చంద్రుండు చెలువంబుగ నహల్యా
శిక్షఁ దొలఁగించు కథను—విన వీనుల విందగును ॥శ్రీ॥

అ॥ ధారుణీశ్వరు గాధితనయుండు దీవించి
కోరి సలిపిన పూజలంది—యెంతో ముదమంది ॥శ్రీ॥

చ ర ణ ము

సారసాక్షుని మదిని సన్నుతింపుచు నుండ
మీఱు కాలము నందున—సంతానముకలిగిన
మీఱి పొంగులువారు మేటి కౌతుకముచే
ధారు ణీశ్వరుఁ డనియెను—ముని కోరఁగ యోచింపను ॥శ్రీ॥

వ॥ అంత మానీంద్రుండు రాజా! యెద్ది గోరిన నద్ది యొసంగుట
నిజమా! యన దశరథుండు విశ్వామిత్రా!

మ॥ హయ తండంబులొ, గంధసింధురములో, యారామ దేశంబులో,
జయ శబ్దంబులు వల్కు- వందిజనమో, సారంగ దృ క్కాంతలో,
భయముం దీర్పఁగఁజాలి పోరు భటులో, పానీయ యంత్రంబులో,
నయమార్గా! యెదియైనఁ గోరు మిడెదన్ సంకోచమున్ వీడుచున్

వ॥ మునిచంద్రా! మీరు సంకోచింపనేల!

మ॥ ఇనవం శోత్తము లెప్పుడైన నిజమే యింపొంద మా టాడరా!
మునిచంద్రా! మఱి మాట లాడకయె మోమోటంబు నంది౦గ నే

లను గోరుం డిఁక నిచ్చి వచ్చి నటు, లేలా యాలసింపంగ నం
చను రాజేంద్రునిఁ గాంచి గాధిసుతు డత్యాసంద చిత్తుండునై

మోహన చతురశ్ర

ప॥ రాజా! మఱు లెందుకు — దశరథ ॥రాజా॥

అ॥ తేజోనిధీ! శ్రీరామచంద్రుఁడే
ధీయుతుఁ డై మా సవనముఁ గాచును ॥రా॥

చ ర ణ ము

అరమర విడి నీ పుత్త్రరత్నమును ఆలసింపక యె యంపింపఁగనీ
తటి శుభములు మా కొనఁగూర్పఁగలఁడు
తరణికులము దీపించు నామతము ॥రా॥
తాహతజంతరితాం । తరూంతరితాం।తధింగిణతాం త ధి గి ణ త
తదిగిణత । తధిగిణత ॥రాజా॥

వ॥ అనిన దశరథుండు మునీంద్రా! జన్న మేమి? రక్షించు టేమి? నా
రాము నేమి? కోరు టేమి? జడదారీ! యన విశ్వామిత్రుఁడు

ఉ॥ జన్నము సేయ నెంచితిని క్షత్త్రియచంద్రమ! రాక్ష సాధముల్
మిన్నున వచ్చి రక్తమును మించిన క్రూర గుణంపు వర్తనన్
జన్నము పైనఁ బోయుచును చయ్యన నేఁచు చుందు రెప్పుడున్
ఎన్నఁగ రామచంద్రు సరి యెవ్వఁడు దైత్యుల సంహరింపఁగన్

చం॥ జలజహితాన్వయాబ్ధిశశి, సజ్జన సంఘ హితాభిలాషినిన్
ఖల దను జారినిన్, హరిని, కాముని మీరిన సుంద రాంగునిన్
మలిన విహీన తాపసుల మానస వాసుని, శౌర్య సంపదన్
బల్లరిపు భీముఁడై వెలుఁగు పావన రూపుని రాముఁ బంపుమా!

వ॥ అనిన దశరథుండు తాపసోత్తమా!

సీ॥ కన్నులం దెఱవని కసు విన్న పాపండు
ఘోర దైత్యుల నిలఁ గూల్చు టెట్లు?
ఇల్లును విడి పోరు గెల్లెఱుంగని కఱ్ఱ
అరి ఖండముల నాజి నణచు టెట్లు?
ఆటలాడఁగ ఖేతి నందుచు నుండెడి బిడ్డ
కుటిల దైత్యులఁ బట్టి కూల్చు టెట్లు?
చదువున మూలంబు సంగ్రహింపని వత్స
శరముల నిగుడింపఁ జాలు టెట్లు?

గీ॥ పద్మ నేత్రుఁడు శ్రీరామ భద్రుఁడరయ
రాత్రి సంచారముం జేయు రాక్ష సాళి
మా కుమారుండు వట్టి యమాయకుండు
వానిఁ గోరఁగ నీ కెట్లు వాంఛ గలిగె?

వ॥ "నేనే సమరమునకు వచ్చి, రాక్షసులఁ ద్రుంచి, నీ యజ్ఞము రక్షించెదఁ గాన మా రామునిఁ గోరకుము స్వామీ!" యని మ్రొక్కుచున్న నా మౌని, రాజున కిట్లనియె

అఠాణ - రూపకము

ప॥ ఇనవం శోన్నత! దశరథ! పనికిమాలినట్టి మాటలా! ॥ఇన॥

అ॥ అని యుండవె యింతకు మున్నరుదుగ నా యాప్సితమ్ము
పనిఁ గాని దీర్తు ననుచు నిటు పలుకఁ బాడి యగునె తలఁప

చ॥ మునివరు లల్గిన యెటు లౌ నని మనమున గమనింపక
నని లే దనఁ దగునె గొనుమి యవనీశ్వర! శా పోదక ॥ఇన॥

చ ర ణ ము

అజసుత! నా మాటలు విను మనిఁ జేయఁగఁ జాలవు సుమ!
సుజ నామర వినుతుఁడు హరి సూనుఁ డై జనించుటఁ గనవె
సుజనుల పోషింపఁగ నిల కుజనుల శోషింపఁగ నా
యజ సుర ముని ప్రార్థనమున నరుదెంచుట యెఱుఁగవు మది ॥ఇ॥

తధింగిణతోం తధింగిణతోం తధింగిణతోం తాకుతాకుధిన్నతోం
తాకుతాకుధిన్నతోం తాకుతాకుధిన్నతోం త_త్తకిటతకతక
తరికిటతాక్కుడుగుం తాకిటతకతక తరికిటతాక్కుడుగుం
తాకిటతకతకతరికిట తా, ధి, గి, ణ, తోం, తాధింగిణతోం
తధిగిణతోం ॥ఇస॥

వ॥ ఓరీ రాజాధమా!

ఉ॥ ఇచ్చెద, సంశయింపక వచించుమి! కోరుమి యెద్దియైన నం
చిచ్చకముల్ వచించి యిపు డీవిధి రాముని వీడఁగా హృదిన్
హెచ్చుగ బాధ నందుచును నేవియొ పల్కుచు బొంకఁ బూనితే?
సచ్చరితుండ వంచుఁ జెయిఁ జాచుట నాదియె తప్పురా! నృపా!

ఉ॥ ఇట్టులఁ గోప మంది చన నెంచితి నంచుఁ దలంపఁ బోకు మీ
పట్టున రామచంద్రుఁ గొన వచ్చిన వాఁడను గాన నిత్తఱిన్
రట్టడి పెట్టి యైన సరె లా వగు శాప మొసంగి యైన నే
గట్టిగ వీనిఁ గైకొనుదు గన్గొనుమా! నృప! యోజ సేయుమా!

వ॥ దశరథా! నా పల్కు లనృతంబు లని తలంచిన మీ వశిష్ఠు
నిష్టముననే పంపుము. యీ సర్వాసర్వాంసహా వలయమున మేమే
రాము నెఱింగినవారము.

మ॥ అనుచున్ గాధిసుతుండు రౌద్రమున రు ద్రాకారమున్ బొందుచున్
కనులం దగ్ని కణంబులం గురియ నా క్ష్మానాథుఁ డత్యంత భీ
తిని నేగఁ గురుఁ డౌ వశిష్ఠుఁ గని యో దేవా! కుమారుండ ర
క్షణ సేయం దగు నంచు పాద యుగళిం గాంక్షించఁ బ్ర ద్వేషుఁడున్

వ॥ ఇట్లేగి గురువరు చరణముల కెరగి

చం॥ గురువర! కౌశికుం డిపుడు కోరెను రాముని దుర టాటవిం
దురితులఁ బో నడంపఁగను దోకొని పోవఁగఁ బాడి యౌనె యీ
చిరుతలు ఘోర దానవుల శీర్షము లె ట్లిల రాల్ప నోనో యీ
వెఱ పు డుగంగ యోచనలు వేడుక తోడుత నేడు చూడుమా!

వ॥ అని నమస్కరించు దశరథుని లేవం దీసి విధి రస నోద్భవుం డగు వశిష్ఠుండు

చం॥ దశరథ! రామమూర్తి హరి తథ్యము, లక్ష్మణుఁడాది శేషుఁడే
విశదము, కైకపుత్రికుఁడు పేరుఁడు శంఖము విష్ణుమూర్తి, కీ
శశివదనుండు గా వెలుఁగు శత్రుహరుండు సుదర్శనంబు, నీ
కుశిక తనూభవుం డటుగు కోరికఁ దీర్పుము సత్వరమ్ముగన్

వ॥ ఇటులఁ బలుకు వశిష్ఠు వాక్యంబు లాలకించి, సాకేత నగ రాధీశ్వ రుండు రామ లక్ష్మణులఁ గొనివచ్చి, గాధేయునకు నమస్కరింపఁ జేసి, తాను వందన మాచించి, బాలకుల హస్తంబుల మానీంద్రు హస్తంబున నుంచి, వినయ వినమిత గాత్రుండై యిట్లనియె

శంకరాభరణము - త్రిపుట

ప॥ మునికులాబ్ధి సుధాకరా! వినుము
మోద మెసఁగఁగ బాలకులఁ గొని చనుము

అ॥ మనమునఁ గల కినుక విడి నా మనవి చేకొని పుత్రికులచే

చ॥ పని నెఱవేర్చుకొని బాలకుల భద్రయుతంబుగ నా కన్నుల
కును గనఁ బరచగఁ దగు యతివర! కోమ లాంగులను విడి మనఁ
గల్గుమనె ॥ము॥

మ॥ అని సామ్యాబ్ధపు మాఘు కృష్ణ విదియం దా రాముతో లక్ష్మణున్
గొనుఁ డంచున్ముద మంది పల్కుచు, దయా కూపారుఁ డా లక్ష్మణున్
గొని, రామా! ఋషి యాజ్ఞలో మెలఁగుమా క్రూరాత్మ లా రాక్షసా
ళిని యుద్ధంబునఁ గూల్చి గైకొనుమురా! లీలన్ మహాకీర్తినిన్

మంజరులు

అని పల్కిన శ్రీరాము పాదంబు మునుముందుగఁ గదలంగన్
"తనయుని కరమును బట్టి దశరథుఁడు వినుము" నామాటఁ దొలఁగన్
దలఁచితివా? శ్రీరామ! యనఁగ నా ధన్యతముఁడు మోచించి
విడిచి నన్నూ, నా తప్పు సైపు మని వినుతించి శిరము వంచి

నిలిచి యున్న శ్రీరాము శరీరము నిమిరి ప్రీతి దశరథుఁడు
సలలి తాకార! మౌని యడుగులను జాడలన్ విడక యుండు

వ॥ అని శ్రీరామ లక్ష్మణుల నాశీర్వదించి పనుప

ఉ॥ దండ కమండలమ్ములను తాపసవర్యుఁడు చేతఁ బట్టె, కో
దండముతోడ రాముఁడును దైత్యులఁ గాలుని వీటి కంపఁగా,
దండిగ నన్న సేవలను ధన్యత నొందఁగ లక్ష్మణుండును భూ
మండల మందు భారమును మాన్పఁగ వెల్వడి రంద రొక్కటై

వ॥ ఇట్లు బయలు వెడలి రాజవీధి నరుగుచున్న పౌరకాంతలు

తోడి - ఖండగతి

ప॥ ఎటనుండి యరుదెంచె నీ ధూర్త మునిముచ్చు
కటకటా! బాలకులఁ గానమునకుఁ గొని చన ॥ఎ॥

అ॥ కుటిల రాక్షసులఁ బైకొనఁ జాలఁ గల్గుదురె
మటుమాయ లెన్నియో మాటాడి బెదిరించి

చ॥ పటు కోపముఁ జెందన్ భయమున దశరథుడున్
అటవి కనిపె ముందున్ హరహర! కనఁ డెందున్ ॥ఎట॥

వ॥ ఇట్లు పౌరకాంత లనేక రీతు లనుకొనుచున్న, శ్రీరామ లక్ష్మణులు
గురుని వెంట పురంబు నిర్గమించి, యరుగుచు కాననంబుఁ బ్రవే
శించి, నడచు నెడ, దురంత దుర్దాంత ప్రతాప పానల జ్వాలాభీల
దీపికలు వెలుంగ, నగ గుహాంతరాళంబులనుండి చనుదెంచి,
పరుగులాడు సింహ, శరభ, శార్దూల, మత్తమాతంగ, భల్లూక,
వృక, వరాహాదిమృగోద్ధ్వానంబు లంబరంబు నంటి, ప్రతిధ్వను
లిచ్చుచుండ, నగశిఖరంబుల నుండి సూర్యకిరణంబుల ధాళ
ధళ్యంబున తళతళ లాడుచు భూమికిఁ దిగజారు కొండసెల
యేళ్లును, కొండసెలయేళ్లం దిలకించి, తల పంకించి, పుల కాంకిత
గాత్రులై నీటియందు కూటమిం జేయు నేనుంగులును, ఏనుంగులఁ
బీనుంగులఁ జేయ నెంచి పైఁ బడు సింగంబులును, సింగంబుల

భంగంబు సేయు తలంపునఁ దిరుగాడు శరభసాళ్వంబులునుఁ గల యరణ్యంబు దాటి ముందు ఝేకీ ఝేక నినాదంబు లాకసంబు బెగడుపరుప, శోభన ప్రదంబై, కృంకువారల సంకటంబుల నిశ్శంక నిరాటంకంబుగా హరింపం దగు సరయూనదం గాంచి శ్రీరామ లక్ష్మణు లందు దేశికు నాజ్ఞచే కృతావగాహులై య జ్జలదేవతన్ గొనియాడి వినతులై నిలువ—

ఆ॥ వె॥ మౌని పుంగవుండు మౌని రక్షకులకు
 క్షుత్పిపాస బాధఁ గూలఁద్రోయ
 బల, యతిబల, యనఁగ వఱలు విద్యల నిడి
 దీవనల నొసంగి దీక్ష నుంప

వ॥ ఆబాలకు లారాత్రి యం దా యిసుక తిన్నెలఁ బవళించి నిదురించి యుండ మరునాఁ డరు ణోదయమ్మున శ్రీరాము నిదుర మేల్కొల్పుచు విశ్వామిత్రుండు

శ్లో॥ కౌసల్యా సుప్రజారామా! పూర్వా సంధ్యా ప్రవర్తతే
 ఉత్తిష్ఠనర శార్దూల! కర్తవ్యం దైవ మాహ్నికమ్

వ॥ ఇట్లు రాము మేల్కొల్పిన దాన వాంతకుండు సోదర యుక్తుండై లేచి కాల కృత్యంబులం దీర్చియున్న మునివరేణ్యుండు

ఆ॥ వె॥ మాఘ బహుళ తదియ మహి మాస్పద మ్మని
 యస్త్ర శస్త్ర విద్య లవిరళముగ
 బోధఁ జేయు చుండ మోదంబుతో వారు
 నేర్చి రొక్కనాఁడె నిపుణు లగుచు.

వ॥ ఇట్లు విద్య లెల్ల నేర్చి మార్గంబునఁ జను చుండ గరుడుండు వియ న్మార్గంబు నుండి కోదండం బను ధనువు రామమూర్తి కిచ్చిన

కాంభోజి - ఖండగతి

ప॥ భాగీరథి న్దాటి పయనంబు సాగించి
 యేగుచును మునివరుఁడు నేగి గలుగఁగఁ బలికె ॥భా॥

అ॥ ఈ గహన మధ్యమున నేర్పరచె నొక తావు
సాగరంబును బోలు స్థైర్యమున నొక దనుజ

మి॥ సాగవు మా జపముల్ చక్కని వగు తపముల్
సేగిగ సవనంబుల్ యేగతి నొనరుచుటల్ ॥భా॥

వ॥ ఆదనుజ వృత్తాంతంబు సాకల్యంబుగఁ దెల్పువాఁడ సావధాన చిత్తం
బున వినుము రామచంద్రా! యని ముని యిట్లనియె.

మ ధు ర గీ తి

గతకాలంబున సుకేతుఁ డను యక్షవరుఁడు బ్రహ్మను గూర్చి
నుతభిక్షుకు నై తపం బొనరింప సుత నిచ్చి దానిఁ గూర్చి
ఈగతిఁ దెలిపెను వేయి యేనుఁగుల కీడగు బలమున మెలఁగు
సాగరంబుఁ బోలిన గంభీరము చక్కఁగాఁ గలిగి పెరుగు
అనిన సుకేతుఁడు పిలిచెను తాటక యని ప్రేమతోడ దాని
చనవుగ సుం దాఖ్యుండే దీనికి సరియంచు మదిం బూని

ఉ॥ సుందున కిచ్చి పుత్త్రికను చోద్యమునంద సురాళి "పెండ్లి" బల్
పొందికతో సుకేతుఁడు ప్రమోదము నొంద నొనర్చి, యల్లుఁడా!
పొందుము సర్వ సౌఖ్యములు భూప్రజలెల్ల బలే యనంగ నీ
కందువచంద్రు మీరిన ముఖంబున వెల్గెడి నాదు పుత్త్రితో

వ॥ అని పుత్త్రి నప్పగించి పనుప నా తాటక

బిలహరి - చతురశ్ర

ప॥ సుందు నందు తాటక యానందము
నంది కాంచె సుతుల—మారీచ సుబాహుల ॥సుం॥

అ॥ పొందికతో పుత్త్రి ద్వయమును గని
మోద మందుచుండ—సుందుని కాలము నిండ॥

మి॥ బొందినుండి తేజము వెల్వడి గోవిందు నందుఁ జేరి యుండగ బ్ర
హ్మాండ మైన పతి వియోగ దుఃఖము నంది విధిని దూరె నిట్లు తాటక॥సు

మ॥ పరమేశా! నను దుఃఖ వారినిధి ముంచన్ గోర్కె జన్మించెనా?
స్థిర మీసౌఖ్య మటంచు నెంచు పతి నీ తీపం విడందీయుదే?
కరుణాలేశము లేకపోయినదియా కంజాసనా! యిప్డు నా
పరితాపంబె త్వదీయ మానసమునన్ భాగ్యంపు టానందమా!

ఉ॥ ఎంతటి రాతి గుండెవొ! యి దెంతటి క్రూర కృతంబు నీకు నే
డింతగ నన్ను వేచుటను నేటికి కోరికి గల్గె, దుర్విధీ!
సుంత హృదంతరంబునను చోటు నొసంగవ ప్రేమపూవమా
కాంతకు, దుఃఖ పెట్టుదువె! కాంతల కాంతుల వీడదీయుచున్

శా॥ సుందుం డంతము నందె, నీ బుడుతలో? శోకంబున న్మున్గి యుం
డెందుం గానక కొందలం బడిరి, నే నే దిక్కు లే కుంటి నే
సందే హంబును లేక యాహారుఁ డు విస్తారంపు దుఃఖంబులో
మందం జేసెను నాదు జన్మదశ నీమాడ్కిన్ గటా! దుర్విధీ!

ఉ॥ రక్కసు త్రుళ్లడంపఁగ సరాసరిఁ బోయి సముద్ర నీరముల్
బక్కట త్రావి సద్యశము నొందిన యట్టి మహామునీశు, పెం
పెక్కిన యోగదండ ధరు, నీశ్వర సదృశు డౌ యగస్త్యుఁ దా
నొక్క యరణ్య మందు సుతయుగ్మముతో సతి కాంచె న త్తరిన్

దేవగాంధారి - త్రిపుట

ప॥ మానివర్యునిఁ గాంచి, సుతులతో మాన్యత విడనాడి తాటక ॥మా

అ॥ హీనముగ మాటాడు చుండఁగ చాన నిటు శపించె, సుతులతో

చ॥ పూనిక నాసురత్వమున నీ కాననమున సంచరించుచున్
మానిత సౌఖ్యంబుల విడి మను మటంచు నాయగస్త్యుఁడున్ ॥మా

ఉ॥ రామ!నృపాలసోమ! మునిరాజమనోంబుజవాసకామ! సు
త్రామ ము ఖాదిదైవత కరార్చిత పాద సరోజ యుగ్మ! యీ
రామను చూచి నీ విఁక శరంబు నమర్చ్చ దనస్సు నందు, నీ
కామిని యజ్ఞమున్ జెరుపఁ గామము గల్గిన దయ్యె! యెప్పుడున్

గీ॥ దీని కున్నారు పుత్త్రిలు దివిజ వైరు
లన్ని విధముల క్రూరంబు లెన్నికఁ గని
వారి నిఁక ముందుఁ గాంత మవార్యచరిత!
వింట సంధింపు బాణ మా విధి భ్రమింప

వ॥ అనుచున్న తాటక యొక నగ కుహాంతరాళంబునుండి భయంకర మ్మొగా మేఘ వినిర్గత శబ్దంబు కరణి నార్భటింపుచు బయటి కరుదెంచి—

శా॥ ఏమీ కమ్మని వాసనల్ గలిగె, నే డేమో వికాసించెనే
ఈ మార్తాండుఁడు, వచ్చుచుండి రరుగో యింపొందఁగా బాలకుల్,
ఏమాడ్కిన్ మది నెంచఁగా గలను నే నెవ్వారలో వీర, లీ
సీమన్ జేరుట కేమి హేతువొ గదా? శీతాంశు చండాంశు ల
క్ష్మీ మాన్యత్వముఁ జూపు చుండి, రిపుడే రేకెత్తె నా నోములున్.

మంజరి

వీరి తలలు నాముక్కుపుల్లలకు వేగముగా నిడుకొందు
వీరి మాంసమే రుచియించుఁ గాన వేడ్క చీకు లటు గొందు

వ॥ అని తలంచి తలఁ బంకించుచు పై కరుదెంచుచున్న, గాధినంద నుండు శ్రీరాము వెనుక కరిగి, యోదనుజా! నామాటలు వినుమా! యని

శంకరాభరణము - త్రి - త్రిపుట

ప॥ ఇంక నేమి సేయఁగలవె? బొంకులాడి! అచ్చోటట నిలువవె ॥ఇం॥
అ॥ గొంకుఁ జంకు లేకయె ముని తనయులఁ
గోర్కె దీరఁగ తినియుండవె? కలుషి ॥ఇం॥

చ॥ చంకపాప లెందఱినో నిశ్శంక నిరాటంకంబుగఁ దిని
గొంకు జంకు మాలి యుంటివే కూడునె నీముఖముఁ జూడఁగ కుటిల॥ఇం

వ॥ యిట్లా దనుజతోఁ బలికి రామునిఁ గాంచి రామా! శరంబు వింట సంధింపుమా! యన రాముం డట్లే సంధించి నిలిచిన మునీశ్వరుండు గాంచి.

ఉ॥ ఒక్కట భూమి సృష్టియు, మఱొక్కట మానవ సృష్టిఁ జేసి, వే
ఱొక్కట జీవకోటులను నుమ్మలికంబుగఁ గర్మఁ జేయఁగా
నిక్కవు మానసంబున నె చేర్పడ నుంచుచుఁ గర్మభారముస్
చక్కఁగ ద్రోయఁ జేసెదవు సత్వగుణాకర! లక్ష్మణాగ్రజా!

ఆ॥ పవనము నొసరించి పర్వుల సృజియించి
పవనము నొసరింపఁ జాల కున్న
నన్ను పొంద లేరటన్న పీవె దనుజఁ
జంపకున్న నింక పవన మెట్లు

మ ధు ర గీ తి

ఆలసింపఁగాఁ దగదు నీకు నేఁ డయోధ్య వాసా! క్షణము
మేలము గా దిది కాండము విడువుము మేదినిఁ గూలఁగఁ గొనుము
అని పలికిన గాధేయు వాక్యముల కలరి శ్రీరాముఁ డంత
మునుకొని బాణము విడచిన, తాటక భూమిఁ గూలెఁ గుడు వింత
అంతట హరి కడనుండి విమానము యరుదెంచఁగ నా కాంత
మంతనంబు నందు సంతసించుచు మాధవు నెన్నుచుఁ గొంత
మాఘు బహుళ చవితిని తాటక మావరు లోకముఁ జేర
అఘ హరుఁ డగు శ్రీరామునితో శి ద్ధాశ్రమమును ముని చేర

ఆ॥వె॥ శిష్యు లెల్లఁ గూడి చిద్రూపు నుతిఁ జేసి
యజ్ఞ పరికరంబు లన్ని యొకట
నుండఁ జేసి నిలువ మండితు డౌ మాని
ఇనకు లేంద్రుతో వచించె నిట్లు

ఆ॥వె॥ యాగహరులు గహనమందున నెలకొని
చెఱుపఁ జూచుచుంద్రు సరసిజాక్ష!
చంపిగాని, వారి చంప కేగాని, నా
జన్న మలరఁ జేయ జనును నేఁడు

వ॥ అని శ్రీరామునకుఁ దెల్పి యజ్ఞము ప్రారంభించి ఋత్విజులు మంత్రముల్ జదువ, నాద్యం బగ్నియం దిడ, నా హోమధూమం బాకసంబున కెగయ

అఠాణ - త్రిపుట

ప॥ అరుగుదెంచె సుబాహుఁ డాకస మందునుండి మాంసముం గొని ॥య
అ॥ సురుచి రాంగుఁడు రామచంద్రుఁడు చూచి యాగ్నేయాస్త్రమున నా
మి॥ నరహంతకుఁ గూలనేయఁగా నానావిధ రక్తభాండముల
 సరుగునఁ గొని మారీచుఁడు వేసరక నీరదము లందు నిలచెను ॥అ॥
వ॥ ఇట్లున్న మారీచునిపై దాశరథి

మం జ రు లు

అలిగి శ్రీరాముఁ డంబరంబుపై అనిలబాణమును విడఁగ
విలవిలలాడుచు నస్త్రి ఘాతమున వేగ జలనిధినిఁ బడఁగ
సుర లెల్లరు రామునిపైఁ గురిసిరి సుమవర్షంబును ప్రేమ
సరసు లైన మునివర్యులు రాముని సన్నుతిఁ జేసిరి "రామ"!

వ॥ అంత మారీచుండు రాము స్మరించుచు మెల్లన లంకకుఁజేరి సుఖం
 బుండె, నిట పంచాహ్నిక దీక్షతో సవనంబు సంపూర్ణంబుఁ గావించి
 ఋత్విజుల కట్నంబు లర్పించి విశ్వామిత్రుండు రామచంద్రుం
 దిలకించి

బిలహరి - చతురశ్ర గతి

ప॥ శ్రీరామా! నీ కారుణ్యంబునఁ జేసితి యజ్ఞము తృప్తినిఁ బొందితి

అ॥ భార మంత నీపై నిడుకొని యా ఘోర దానవులఁ గూల్చి కృతము నెఱ

మి॥ వేరఁ జేసి కోరికఁ దీర్చితి వఘుహారి! సూరిజనాధారీ! శౌరీ!
ధారుణి మీకొసఁగు కట్నమును గననేరనైతి నేరమెంచ కుండుము ॥శ్రీ

వ॥ అని రామ లక్ష్మణులఁ గీర్తించి కౌఁగలింపఁ
 గీ॥ పదియు నార్వేల యేవురు పరమమునులు
 కౌఁగలించుచు శ్రీరాము గదిశి యిట్లు
 పలుకఁజొచ్చిరి పెండిలి సలుపుకొనుము
 పైని కృపఁజూచి దర్శన భాగ్య మిదుము

వ॥ అని కోరెడి వారల కోరికల దీర్చి సెలవిచ్చిన రామునిచే సెలవంది వారలరుగ

ఆ॥వె॥ మాఘ బహుళ దశమి మాని చంద్రుఁడు రామ
లక్ష్మణులను వెంట రమ్మటంచు
మిథిల దారి నరిగి మించిన యానంద
మునను గంగ దాటి పోవుచుండ

వ॥ శ్రీరామ లక్ష్మణులు ముని వెంట నడచుచు

గమనశ్రమ - త్రిపుట

ప॥మునినాథ!యీవనమునుఁ గనుంగొన మోద మందెను నాదుమది॥ము

అ॥గణుతింప వశమె నగసముదయములు గగనతలమున కెగయఁగ॥ము॥

చ॥ ఘనులు మునులు గతకాలంబున ననువుగఁ దప మాచరించి నటు
గనుపట్టుచు నున్న దారా! భళి! కమలజు చేత లెన్నఁగ ॥ముని॥

వ॥ అని పలుకుచు గౌత మాశ్రమంబు కడ కరిగిన

ఉ॥ రాముని పాదధూళి చని, రాలకుఁ దాకిన, మధ్యనుండి శ్రీ
రామునిఁ బాడుచున్ వెడలె రామ యొకర్తుక, దానిఁ గాంచి, యా
రాముఁడు వింత నంది మునిరాజును గన్గొని ప్రేమతోడ నీ
కోమలి సచ్చరిత్రమును గూర్మిని నే వినువాఁడఁ దెల్పుమా!

వ॥ అనిన రవికుల తిలకుని పలుకుల కానంద మంది గాధినందనుం
డహల్యా చరిత్రంబుఁ జెప్ప నారంభించె —

# గ ద్య

శ్రీ రాజ్యలక్ష్మీ సమేత యోగానంద నృసింహ మూర్తి కరుణా కటాక్ష

వీక్షణా లబ్ధ సహజ కవితా ధురీణ ఆత్రేయస గోత్ర ఆపస్తంభ

సూత్రాంతర్గత మూర్తి వంశ పయః పారా వారరాకా

సుధాకర రామలింగేశ్వర శాస్త్రి పౌత్ర, లక్ష్మీ

నృసింహశర్మ సీతరామాంబికా పుత్ర హరికథా

ప్రభోధకరత్న వేంకటేశ్వర శాస్త్రి చే

రచింపంబడిన సీతారామ చరి

త్రంబను యక్షగాన ప్రబం

ధంబున సీతాకల్యాణ

భాగమునం దహల్యా

శాప విమోచనం

బను కథ

సంపూ

ర్ణము.



# శివధనుర్భంగ సన్నాహము



కేదారగౌళ - ఖండగతి

ప॥ శ్రీరామచంద్రుండు శివధనువు మోపెట్ట
శ్రేయతముఁ డగు జనకు సభ కరుగు కథ యిద్ది ॥శ్రీ॥

అ॥ భార మనకయె మనసు భద్రంబు గా రాముఁ
జేరఁగాఁ దీసి విన్న—పాపము గలుగుట సున్న ॥శ్రీ॥

చరణము

రఘువంశ సోమున కహల్యా చరిత్రంబు
మఘువు చైదము నంత మౌనిచంద్రుఁడు తెలిపె
నఘదూర! యని భవుం డానతిచ్చిన యంత
నది తెల్పు మని వేఁడె నాపార్వతీదేవి ॥శ్రీ॥

ఉ॥ శాప విమోచనం బవుట సర్వులు మెచ్చ నహల్య నిల్చినన్
దాపసిఁ గాంచి, రాముఁడు, విదారిత కిల్బిష యెవ్వ రీమె, స్వ
ర్గాపగ మాడ్కి నిర్మలతగాఁ గనుపించు, కఠోరవృత్తిచే
నీపగిదిన్ వనంబున వసించుట కెయ్యది హేతువో గదా!

వ॥ అని పలుకు శ్రీరాము పల్కులకు విశ్వామిత్రుండు

ఉ॥ పున్నమ చందమామ సరి బోలిన మోమును, తామ రాకులన్
జిన్నతనంబు సేయనగు చెల్వగు కన్నులు, నాగరాజుచే
మన్ననలందు వేణియును మన్మథు నాతిని గేరు రూపుచే
వన్నెలు గల్గి వెల్గు సుత బ్రహ్మ సృజించి ముదంబు నందుచున్

మ ం జ రి

నామం బుంచి యహల్య యనుచు నానందంబుగఁ బరికించి
క్షేమము చేకుర దీని వయం డేట చెలఁగుచుండె నని యెంచి

గీ॥ భూ ప్రదక్షిణ ఫలమునుఁ బొందువాని
కిచ్చి వైవాహిక మ్మొనరింతు సుతను
అనుచు ధాత ముల్లోకము లందు చాట
వజ్రి మొదలగు వారు వెల్వడిరి యపుడె

కం॥ చనియెడు వారిన్ గనుఁగొని
వాసజాసను సూను డక్షపాదుని తోడన్
వినుపించె సకల సుఖముల
నొసగూర్పం గలుగు నట్టి యుక్తిన్ రక్తిన్

నాట - త్రిపుట

ప॥ గౌతమా! నామాట వినుమా! ॥గౌ॥

అ॥ నీతియుతుఁ డగు నలువ సుతఁ గని పు
నీతునిగ నహల్య యని పిలిచి

చ॥ భూతలప్రదక్షిణంబు మును మున్నుగఁ జేసిన వానికి నిడి
చేతును బెండిలి యని ప్రతిజ్ఞఁ జేయఁగ నరుదెంచితి నీకడ కో ॥గౌ

చ ర ణ ము

ఇయ్యె దెంతయో సుదినమయ్యెను ఈశుకృప నీయందుఁ గలిగెను
చయ్యన నీ యాశ్రమంబున సకల శుభములు కలుగుచుండెను
అయ్యదె కపిలగోవు ద్విముఖం బంది యుండెఁ గాంచి ప్రదక్షిణ
మియ్యెదనునఁ జేయఁగఁదత్ఫలమెంతో,యంత,ననుభవింపఁగాగలవు॥గౌ॥

సీ॥ నేరిచినావు విద్దియల నేర్పుగ వాని ఋణంబుఁ దీర్పఁగాఁ
గోరిమిఁ బెండ్లియాడి సురకోటులకున్ పయి పితృవర్గపుం
భారముఁ బాపుమయ్య! హరిభక్తవరా! విని నాదుపల్కులన్
మేలగు గోప్రదక్షిణము మిధ్యలు గా విక నాచరింపుమా!

మ ధు ర గీ తి

గో ప్రదక్షిణము భూ ప్రదక్షిణము గూర్చ్చ ఫలం బిల సమము
సప్రమాణముగఁ జెప్పి యాజ్ఞవల్క్యా! సతముఁ గలుగు సంతసము
అనుచు గో ప్రదక్షిణముఁ జేయించి యప్పుడు గొంపోయి పూని
వినయముతో మ్రొక్కించి, విడిచికి, ద్విజు పెండిలిఁ జేసెను పూని
అంతట ప్రేమను దేవేంద్రుం డా యజుని కడ కరుగుదెంచి
దంతిని దిగి పదముల కెఱఁగినఁ గని ధాత పలికె తగ వెంచి

ఆ॥వె॥ గౌతముండు మున్న తాన్ ప్రదక్షిణమును
జేసి వచ్చె నంచుఁ జెప్పె నార
దుండు, గాన మునికి దోయజాక్షినిఁ గూర్చి
నాఁడ నసఁగ మఘవుఁ డాడె నిట్లు

శా॥ ఓరీదుష్టుఁడ! నేనుగ్రకోపనఁగ నుద్యోగించు పూఁబోఁడి నీ
వేరీతిన్ గొనినాఁడ వోర! మదిలో నేమాత్రమున్ గాంచవా!
వీరుండన్, సురనాథుఁడన్, మఘవుఁడన్ విఖ్యాతి, నీజీవితం
బేరీతిన్ నిలువంగ నేర్చునో మునీ! ఇంద్రుండు క్రోధించినన్

మ ధు ర గీ తి

ఇట్టు ప్రతిజ్ఞను జేయుచు నింద్రుం డేగెను నాకముఁ జేర
గట్టు విల్కాని నామ మెన్నుచును గౌతముండు తమి దీర
కాముకేళి నోలలాడు చుండఁగ గౌతమముని కొకపుత్త్రి
నేమమమీరఁగఁ గలుగ "నంజ" నని నేర్పుగఁ బిలిచిరి ధాత్రి
సుతుఁడు కలిగె శతానందుఁడు నా శ్రోత్రియుఁడగువాఁ డొకఁడు
కుతుకము తోడుతఁ బెంచుచు నెంతయో కోర్కెను దంపతు లందు
ఇట్టు లుండ దేవేంద్రాద్యులు నాఈశ్వ రాజ్ఞచే వెడలి
పుట్టఁగ పుత్త్రుల రీతి నహల్యకు మునులు సురలు సంతసిలి

మ॥ ఒకపుత్త్రిన్ సుతులిందరున్ గలుగ, నుద్యోగించి మౌనీశ్వరుం
డొకనాఁ డాశరథిన్ మునుంగ మదిలో, నొక్కండు గాకుండ, నో
పిక రమ్మంచు కుమారులన్ సుతను తాఁ బిల్వంగ, సంతోషమున్
ప్రకటన్ జేయ ఇట్టులనేగఁగను సానందంబుగాఁ బుత్త్రిలన్

ఆ॥ వె॥ ఎత్తికొనుచు నడువ నొత్తి యంజన పల్కె
నాన్న! నీదు సుతను నన్ను విడచి
పనుల నెత్త నీకు భావ్యమా? యిది తెల్పు
మనఁగ మౌని సంశయమ్ము నందె

ఉ॥ అంజన తెల్ప, గౌతమ మహాశయుఁ డంత యెఱింగి, పుత్త్రిలన్
గుంజుకపోయి, సంభ్రమున, కూయిడ బాలురు, ద్రోచి పల్కె మా
యంజన పల్కు వాక్యము యథార్థమె యయ్యెన, మర్కటాకృతుల్
మంజులరీతిఁ గైకొనుచు మానవ రూపము వీడుఁడీ యనన్

ఆ॥ వె॥ మౌని శాప వశత మర్క టాకృతులంది
వనధి మధ్యనుండి వచ్చి గహన
పథములందుఁ దిరిగి ఫలములు భుజియించి
అన్న, తమ్ము లుండు నంత నొకట

ఆ॥ వె॥ ఋక్షవిరజుఁ డనెడు వృక్షచరుఁ డొకండు
వార్ధి తీర మందు వాలి, ననుజుఁ
గాంచి ప్రేమతోడఁ బెంచఁగా మది నెంచి
వారి వెంటఁ గొనుచుఁ జేరి పురము

కం॥ వాలిని కిష్కింధాపురిఁ
బాలింపఁగఁ జెప్పి యరిగె వనముల కతఁడున్
వాలియు మర్కటరాజ్యము
వాలాయము గాఁగ నేలె వాసవు కరణిన్

వ॥ అంత నిట గౌతముండు

మ॥ సుతతో గౌతముఁ డిల్లుఁజేరి తరుణిన్ శోధించ యత్నించి, యే
గతి వచ్చున్ సమయంబు నా కనుచు, నేకం బైన చిత్తంబుతో
సతివంకం బరికించుచుండ మరుశస్త్రంబుల్ వెసం దాకఁగా
నితరం బెంచక స్వర్గనేత యగు దేవేంద్రుండు కామాంధుఁడై

బిలహరి - ఖండగతి

ప॥ కుక్కు టాకృతినిఁ గొని గ్రక్కునను వెడలి హరి
మక్కువతో నరుదెంచి కొక్కొరొకోయనుచు

ఆ॥ మిక్కుటంబుగఁ గూయ మేదినీసురుఁడు ప్రా
గ్దిక్కునకు భాస్కరుఁడు నిక్కముగ వచ్చెనని

కం॥ ప్రక్కను విడి యేగెన్ భాగీరథిలోనన్
మక్కువ స్నానంబున్ గ్రక్కునఁ జేయంగన్ ॥కం॥

మ॥ ముని యేగన్ సురనేత మంతనములో మోదంబునుం జెంది నా
కను వమ్మెన్ మునిపత్నిఁ గూడఁగ, మదిన్ సాలోచనల్ సాగఁగం
డు నెయెప్పట్టున నైన నంచు, గృహ మాటోపంబుగాఁ జొచ్చె.నా
ముని రూపమ్మున, ధర్మదేవత మదిన్ బొక్కంగ, దేవేంద్రుఁడున్.

వ॥ ఇట్లా పాకశాసనుండహల్యా వ్యామోహ పీడితాయ మాన మాన
సుండై, మరుబారిం జిక్కుకొని ముందెఱుంగక నెగ్గితనని ప్రశ్నలు
గొట్టుచు దండివానిగతి నిండిన కౌతుకంబున కవాటంబు దెఱపించి
గృహంబు ప్రవేశించి—

కళ్యాణి - త్రిపుట

ప॥ మానిసతితో పాకశాసనుఁడు మారసౌఖ్యము లందు చుండఁగ
అ॥ మానిత చరితుం డగు గౌతమ మానివర్యుఁడు విష్ణుపదమునుఁ
మి॥ గాన, నుషఃకాలము తెలియక కాలజ్ఞుం డెటుఁ గూసెనో యని
పూని యోగమహిమనుఁ గని సురపురీశుఁ డరుదెంచుటఁ దాఁ దెలిసి॥మా

చ ర ణ ము

ఇంటికడ కరుదెంచి సుతఁగని తుంట రెవ డరుదెంచినాఁ డ ని
గంటువెట్టుచు పుత్త్రి నడిగి మంటమంటుచు నిలిచి యుండఁగ
తుంటరికృతమున కరుదెంచిన దోషయుతుఁడు నీతివిదూరుఁడు
తొంటిరూపు విడి గృహమును నీవంటివాఁడు చొచ్చె నని యెనంజన ॥మా

ఉ॥ అంతటఁ బాకశాసనుఁ డహల్యను వీడి మునీంద్రు కిట్లనెన్
కంతుని కాండ మగ్నవతిఁ గాల్పఁగ నీసతి చెంతఁ జేరితిన్
షాంతకుఁ దీసి ప్రోవు మిఁక భూసురనాయక! బుద్ధిహీనుఁడన్
కంతుని కాండ ఘాతకుఁడుఁ గాంచఁగఁ గల్గునె ధర్మ మెన్నఁడున్!

### మంజరులు

అని యిటు మొరలిడు దేవేంద్రునిఁ గని యనుకొనియెను యోచించి
ఘనుఁడగు కాముని యుక్కురులఁ జిక్కి చనుదెంచుట మదినెంచి
సహస్రాక్ష! నివృషణంబుల్ దెగి చయ్యనఁ బడు నీభువిని
కుహరంబున నరుదెంచితివి గాన గుణహీనుఁడ వనె మౌని

### మత్తేభమాలికావృత్తము

హరి యెంతో మది వంతనంది చని, యన్యాయంబుగా సాధ్విపై
మరుప్రేమన్ గన నేల యింత? కలిగెన్ మర్యాదఁ బోనాడి ముం
దరయన్నేరక కుక్కుటంబు సయి కూయన్ భావ్య మౌనా? మునీ
శ్వరు డప్డే నదికేగ, నేగంగను యాశాపాశ బంధుండనై
కొరగానట్టి కృత మ్మొనర్చి యఘమున్ గొం టొక్కటే గాక, నా
పురుషత్వంబునుఁ బోనడంచుకొని మున్ముం దీశచీకాంతకుం
సురబృందంబున కెంతొ దూరమవుచున్ శోకింపఁగావచ్చె, నీ
పరదారా హరణంబు గూర్చు ఫల మీపాపంబు గా కెన్నఁడున్
వర శర్మం బెటు లబ్బు నంచు విలపింపంజొచ్చి దేవేంద్రుఁ డా
సురబృందంబున కంతఁ దెల్ప వినుచున్ శోకించి వా రెల్లరున్

### శంకరాభరణము - త్రిపుట

ప॥ పాకశాసను కభయ మొసఁగుచు వీఁక వెడలి సురతండ మంతట

అ॥ ప్రాకటముగ పితరులఁ జేరి నాకనేత దుర్దశనుఁ దెల్పి.

చి॥ ఏకరణిని సురరాజ్యంబున నింద్రునిల్పి ఖ్యాతిఁ గందురని య
స్తోకంబుగ నుతిఁజేయుచు సుశ్లోకుల పద కమలంబుల కెఱఁగిన ॥పా॥

చం॥ పితరులు నింద్రు దుర్దశను వింతలు గొల్పఁగ నాలకించి, వే
హితమతి మేష ముష్కరము లిత్తుము వాసవుఁ దోడి తెండనన్,
కుతుకము నంది నిర్జరులు గోర్కె ఫలించె నటంచు వేగ దుః
ఖితుఁడగు నేతఁ జేరి జరిగెన్ గృత మంచు వినంగ జేసినన్

ఆ॥వె॥ వాసవుండు నాక వాస మిచ్చితి నీకు
మీరు చేసినట్టి మేలు మఱవ
జాల ననుచు సురలఁ జాలగాఁ గొనియాడి
పితరు లుంకు నెలవుఁ బ్రీతిఁ జేర

ఆ॥వె॥ మించు మంత్ర శక్తి మేష ముష్కరంబు
లిచ్చి పితరు లంప నింద్రుఁ డేగి
త్రిదివ రాజ్య మందు త్రిదశులెల్లరుఁ గొలువ
పాలనంబుఁ జేయు పట్టు నందు

చం॥ అట సురసేత సౌఖ్యముల నన్నిటి వీడి తపింప, గౌతముం
డిట సతిఁ గాంచి శాపమును నిచ్చె కుశల్ ధరనుంచి వానిపై
చటుకునఁ గూలు మంచు మది సత్వము వీడి, యహల్య మ్రొక్కె, నె
ప్పటికగు శాపమోచనము బ్రహ్మమునీశ్వర! తెల్పవే! యనన్

వ॥ ఆమౌనిపుంగవుండు సతి కిట్లనియె.

చం॥ దితిజుల నుక్కడంపఁగను, దివ్యులఁ బ్రోవ, నయోధ్యయందు, శ్రీ
పతి జనియించి యిచ్చటకు వచ్చును, ఆతని పాదధూళి నీ
పతితము వీడసీయు నని పల్క నహల్య రమావరున్ మదిన్
స్తుతి యొనరించుచున్ బడుచు తోయము సైతము వీడి దర్భలన్

ఆ॥వె॥ సుతను గాంచి పలికె, సుఖము లేకఁ బోవ
భర్త యగును కోఁతి పాపచిత్త!
యనుచు, సుతున కనియె, నార్తి కల్గఁగ నీవు
ఉంఛవృత్తితోడ నుండుమనుచు

వ॥ అంత శతానందుండు మిథిల కరిగి జనకరాజు పురోహితుండై
కాలంబుఁబుచ్చుచుండె నిచ్చట అహల్య దర్భలం బడియె—

బిలహరి - చతురశ్ర

ప॥ చతురాననవంశ జలధి చంద్రుఁడు సతివియోగమును గని వెనుకకుఁ గన

అ॥ పితరునిఁగని యంజన కనులు మొగిచి విలతమతిని నా ప్రతినము వినుమని

మ॥ కుతుకంబును విడఁ బాడియగును, నీసతియు నీవు గలయునంత వఱకీ
గతి విడువక యంధత్వంబున నే కడగండ్లను నందుదు ననియెను ॥చ

వ॥ అంత నామహానీశ్వరుండు

శా॥ అంధత్వంబునుఁ బొంది యున్న సుతతో నల్లాడు చెట్లో గదా?
బంధువ్రాతము లేదు దీనిఁ బెనుపన్ బ్రారబ్ధ మెట్లున్నదో?
సంధింపంగను శక్తివంతుఁ డెటులన్ సంప్రాప్త మాదీని కీ
యంధత్వం బాక టుంటచే, విధికి మాకౌనా కృతం బెన్నడున్

వ॥ అని యెంతయో యోచించి యిట్లెంచె

ఆ॥వె॥ మాల్యవంత మందు మానివర్యులఁ గావ
సరసమతిని "శంఖ" "శబలము" లను
గజయుగంబుఁ జంపఁగా గల్గు నొక కోఁతి
సృష్టిఁ జేసె స్రష్ట చిత్రముగను

వ॥ అంత నామర్కటేంద్రుం డరుదెంచి వారణంబుల హరించిన మునీం
ద్రులెల్లరు సంతసించి రందు

శా॥ భారద్వాజుఁడు పల్కె వానరునితో బాలార్క తేజుండవై
వీరత్వంబున నెన్న గున్నలను నీవే యంత మొందిచినా
వారా! కేసరి వైతివయ్య! యని పై నత్యంత సంతోషియై
కోరంగాఁ దగు నేది యైన వరమున్ నోర్కెల్ మదిన్ రేకొనన్

మ ధు ర గీ తి

ముని యిటు దెల్పిన కేసరి కోరెను మోదాంబుధిలో మునిఁగి
ఇన తేజుంసును కామరూపుఁడును ఈశ్వరసమసుతు నొసఁగి
నీవాక్యంబును నిల్పఁబెట్టుకొన నేఁ బ్రార్థించెద మౌని
నీ వింకను సెలవొసఁగినఁ జనియెద నెచ్చటి కైననుఁ బూని

చం॥ అని యిటు గోరు వానరుని నా మునివర్యుఁడు గాంచి పల్కె,నీ
వనమున నుండు మింక నిరపాయముగా మనువారమయ్య! నీ
కును సుతుడొక్కరుండు గలుగున్ బలవంతుఁడు కామరూపి యన్
మునిపతి వాక్యముల్ విని తపోధనులన్ విడనాఁడ కాతఁడున్

ఆ॥ ఇ॥ మాల్యవంత మందు మనుచు నుండెను వాన
గోత్రముందు సచట, యుత్తముందు
గుణవిశేషు డతనిఁ గొనియు నిటకువచ్చి
పెండ్లిఁ జేతు సుతకు ప్రీతి ననుచు

వ॥ ముని యరిగి, వెతకి వెతకి కేసరి న్గొనివచ్చి. యంజన నిచ్చి వివాహంబుఁ గావించి, సుత నప్పగించి, గౌతముండు తపోవనంబు నన, సప్తమూర్తి వీర్యబలంబును, కశ్య, పాత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, వశిష్ఠ, జమదగ్ని కాంతల రక్తబలంబునను, యాస్తె వాయుబలంబు నను కేసరీ యంజనలు హనుమంతుం డను పుత్త్రుం గాంచి, పెంచు చుండె నని విశ్వామిత్రుండు రామ లక్ష్మణులకుఁ దెల్పుచున్న, గౌతముం డరుగుదెంచి శిష్యగణంబుతోను తన భార్యయగు అహల్యన్గూడి శ్రీరాము నిట్లు గీర్తించె.

తోడి - ఆది

ప॥ పరమదయారసహృదయా!— దశరథతనయ! ॥ప॥

అ॥ స్థిరతరమగు నీ మహిమ నెఱుఁగమయ! ॥ప॥

మ॥ అరయఁగ బ్రహ్మాండ స్వరూపమున నవతరించి సకల జీవకోటుల సరసంబుగ సృజియించి యాడించు సత్యస్వరూప! సాధు హృద్దీప! ॥ప

వ॥ ఇట్లు స్తోత్రి మాచరించిన శ్రీరాముం డానందమయుండై అహల్యా గౌతముల నేకంబుఁగావించి వారి యాజ్ఞనంది మునితో మిథిలానగరి కరుగుచున్న విశ్వామిత్రుండు రామలక్ష్మణులకు జనక రాజధానిన్ జూపించి యిట్లనియె.

మ॥ ఒకవంకన్ జలయంత్రముల్, మఱియు విద్యుద్దీపముల్ వెల్గు, వే ఱొకటన్ జిత్రతరంపు శిల్పకళ, యోహో యంచుఁ గాచంగనౌ నొకచక్కిన్ వెలుఁగందు పూవనము లాయుర్వేద రాజ్యంబులో ఒకటే ధర్మముఁ దెల్పు బ్రాహ్మణులతో నొప్పున్ సదా రాఘవా!

వ॥ అని తెల్పుచుపురంబు ప్రవేసింప నా పౌరకాంతలు గుమిఁగూడుచు

మోహన - ఆది

ప॥ ఈతండా! భక్తరంజనుం డసురభంజనుండు, నిరంజనుం ॥డీతండా॥

అ॥ ఆతతాయి వర్గంబునఁ జేరిన యసురవరుల దండించు వీరుండు ॥ఈ॥

౧ జనకుండంపిన తాపసి వెనుకొని చదువులెల్ల నొకదినమున నేర్చినవాఁ॥డీ

౨ మౌని యాజ్ఞనంది ఘోర వనమున మానినియౌ తాటకఁ జంపినవాఁ॥డీ

౩ ఋషిజన్నంబును గాచి వచ్చుచును ఋషిపత్నికి శాపముఁ బాపినవాఁ ॥డీ

౪ మన జనకుని గృహమునఁ గల్గిన శివధనువును మోపెట్టఁ గల్గువాఁ ॥డీ

౫ శివధను వెక్కిడి సీతను గొనఁగా జింతఁ జేసి యరుదెంచిన రాముం ॥డీ

వ॥ అని యనేక విధమ్ముల శ్రీరాముని చర్యలఁ గొనియాడుచున్న, గాధేయుండు తమరాక నా జనకున కెఱింగింప నృపుం డెదురువచ్చి, వారిఁ గొంపోయి కూర్చుండ నియమించి, పూజించి, నమస్కరించి, మునిరాజా! రవి చంద్రుల ధిక్కరించు తేజంబుతో వెలుంగు నీబాలు లెవ్వరో యానతిండన, గాధినందనుండు —

చ॥ దశరథ రాజ నందనులు, తాపసరక్షకులున్, గృపాకరుల్,
నిశిచర హంతకుల్, నరయ నేరని బాహు పరాక్ర మాంచితుల్,
పశుపతి విల్లు మీగృహము పంచన నుంటచె వచ్చినారు మీ
శశిముఖి యైన సీతఁ గొన శంకరు కార్ముక మెక్కుఁ బెట్టఁగా

చం॥ అన జనకుండు సంతసిలి, యా మునినాథునిఁ బూజ చేసి, పూ
వనమున వారి నుంచి, పనివారల సేవకు నిల్పి, నిర్మలం
బున గృహమందు నుండ, రఘుభూపుఁడు లక్ష్మణుఁ గూడి, పూ
వనమున సంచరింపఁగను వాంఛలు గల్గి, మునీంద్రుఁ జేపచున్

మంజరులు

మనమునఁ గలిగిన కోరిక రాముఁడు మునివరుతోఁ దెలుపంగన్
జని వనమునఁ గల చిత్రంబులఁ గని చనుదెం డని ముని యనఁగన్
రామ లక్ష్మణులు కుతుకంబున నారామ వన మందు జేరి
సామజ యానలఁ గూడి తిరుగాడు క్ష్మా సుతఁ గనఁ దరిఁ జేరి

వ॥ రామలక్ష్మణులు సీతయున్న ప్రదేశంబున కనతిదూరంబున సంచరిం
చుచుఁ గొంత తడవున కాయున్నతమునన్నయా జానకిం గని రాముఁడు–

ఉ॥ రాముఁడు లక్ష్మణుం గని, గులాబి మహీజము మాటుఁ జేసి, యా
లేమల మధ్య నున్న దదె వేవారి? మిటారిన మోము తోడ, నా
రామయె సీత కావలె, సరాగముగా నది నాకు భార్యయై
కాము శరంపు ఘాతల విఘాతముఁ జేయునొ? లేదొ? సోదరా!

ఉ॥ చక్కని రూప సంపద, ప్రశస్తతఁ గన్న క్షమాగుణంబుఁ, బై
చిక్కని సిగ్గుచే వఱలు చెల్వముఁ గాంచ, మహా ప్రయత్నతన్
చక్కెరవింటివాని శర జాలము నొక్కటఁ జేర్చి కన్యగా
నక్కమలాసనుండు మిథిలాధిపు నింట సృజించి పంపెనా?

చం॥ దనవునఁ దాపుఁ జేరి, సరసంబుగ మాటల నాడి, జానకీ !
మనసులు వేఱు గావిఁకను మాపని సాక్షిగ నంచుఁ బల్కుచున్
మన తనువుల్ జతం బడుపుమా! యని, కోమలి బాహుపంజరం
బున వసియింపఁగాఁ గలుగు పున్నెపు రోజులు వచ్చు టెప్పుడో?

వ॥ ఇట్లు శ్రీరాముండు తమ్మునకనేకరీతుల బల్కుచున్న తఱి, నట
జానకిన్ గాంచి చెలిమికత్తియలు

అభోగి చ॥ త్రిపుట

ప॥ కనుఁగొనుమా! జానకీ! నీ కనువగువరుఁ డెటఁగల్గెనో రాజులఁ గను॥

అ॥ వినుమిఁక పరాకుఁ జెందక బాలా! అనువగురూపునిఁ గని తెల్పెదనేఁ ॥గను

చరణము

వానినిఁ గను మంగదేశనాథుఁడు వానివెంట కళింగభూధవుఁడు
పూనికతో నిలచియున్న వాఁడే పూరుషసింహుఁడు మగధేశ్వరుండు

మి॥ వానికన్న నధికుండు బలంబున జ్ఞానా జ్ఞాన విమర్శనంబునం
దేని నైన సరిలేరు పోల్ప ధర త్రిగర్తదేశ పాలుండు పావనుఁడు ॥క

సీ॥ జానకీ! కాంచుమా సాకేతపుర వాసుఁ
డాతతాయీ వర్గ హంతకుండు

నీలనీరదవర్ణ మేలఁజాలెడు మేని
కాంతిచే వఱలెడి వింతవాఁడు
గాధినందను సవన మాదిభిక్షువు మెచ్చ
రక్షఁజేసిన యట్టి దక్షుఁ డితఁడు
మునినాతి శాపమ్ము వనమందు విడ జిమ్మి
యరుగుఁదెంచిన యట్టి యందకాఁడు

గీ॥ ఏడె మనసభలో శివువిల్లు నెక్కు-
పెట్టు మగవాఁడు, మిథిలేశుపట్టి చేట్టఁ
బట్టఁగలవాఁడు నీకైనవాఁడు, సీత!
అందచందంబుల నీకు నందువాఁడు

కం॥ అని చెలి పలుకఁగ విని జన
కునిసుత సిగ్గునఁ బలుకక కోమలి నొకతెన్
చనవునఁ జేఁగొని లాగుచుఁ
జన నుంకించుచు నటఁ గల చక్కని పొన్నన్

ఆ॥వె॥ చాటుఁ జేసికొనుచు సాకేతపురివాసుఁ
గన్ను లున్న ఫలము కంటి ననుచు
తొంగితొంగి చూచు తోయజాక్షినిఁ గాంచి
రాముఁ డల్లె నిలిచె రమ్యముగను

వ॥ అంత నాదాదులెల్లరు ఒకరి కొకరి రిట్లనుకొనిరి

ఉ॥ సీతకు రాముడే తగును, సీతనుఁ గాంచ జగంబు నంతకున్
మాతగనుండు, రాముడునుమాయురె! తండ్రిగ నుండెఁ, గాంచుచున్
సీతను, రాముని సరిగఁ జేర్చియుఁ జూడుఁడి వారి చూపులున్
ఈతతి నేకమయ్యె నని హెచ్చుగ దాదులు పల్కుచుండఁగన్

మంజరులు

రవి యస్త్రాద్రికి నేగుచుండఁగా రాజు సుతనుఁ బిలిపించన్
సవినయముగ రామునిఁ జూచుచుఁ జనె జనకజ దాదుల వెంటన్
సీత గృహముఁ జేరఁగ రాముఁడు మది చింతించె దానిఁ గనఁగ
నీత్రివిదుఁడు సౌమిత్రి కాంచి యిది నిజముకలసెమది విధిగ

వ॥ లక్ష్మణుం దన్నమునం జెలంగి వసతిగృహంబునకు రాముం గొం
పోయి, యారాత్రి మునితో సుఖంబుండె నంత

చం॥ రవి యుదయించెఁ బ్రాగ్గిరిని, రాముఁడు నిద్దుర లేచి, యంత నా
నవినయు లక్ష్మణుం గలిసి సత్వరఁ దీరిచి కాలకృత్యముల్
భవరహితుండు గాధిసుతు పాదసరోజయుగంబు గంటుచున్
శివుని నుతించుచుండి రట శ్రేయఃప్రదీవన లంది హరానిచేన్

భైరవి - ఆది

ప॥ అమవస దినమున మిథిలాపురమున అవనీధవు నాజ్ఞ నంది జనములు

అ॥ క్రమముగ వీథుల మంచిముత్యము ల
లంకరించి మించి — కుతుకంబునుఁ బెంచి ॥అ॥

చరణము

నానావిధముల వేదికల నలిపి క్రన్నన సైనికులఁ గ్రమముగా నిలిపి
చెన్నుమీర పథములందెలిపి యాపన్నుల వసతులకుం జేర్పంగ నా ॥అ

సీ॥ అచ్చటచ్చట నున్న యవనీధవుల కెల్ల
నంపించి యోగ్యుల నవని విభుఁడు
వీథి వీథుల యందు సాదరంబున మార్గ
ములఁ జూపఁగా సైనికులను నిల్పె
పదివేల సైనికుల్ బలవంతముగఁ దెచ్చి
శివకార్ముకము సభం జేరిపించె
రాజవర్యుల కెల్ల రాణించుచున్నట్టి
సింహాసనంబుల సిద్ధపఱచె

గీ॥ ఒకట వెలిగింప నంతట నొక్కపరిని
వెలిఁగి యారి, వెలుంగుచు వింతఁగొల్పు
దీపశతముల నిర్మించి, దివిజులెల్లఁ
బొగడ జనకుండు సభఁదీర్చెఁ బొల్పెసంగ.

ఉ॥ అంతట నెందఱో మిగుల నాత్రతఁ వచ్చిరి వాహనంబులన్
సంతసమొప్ప నెక్కి, సభ జానకిఁ గైకొన నేను నేనటం

చెంతయె ప్రీతిఁ బల్కుచు; మునీశ్వరు తోడుత రామ లక్ష్మణుల్
పంతము మీఱఁ జొచ్చిరి సభాస్థలి నెల్లరు విస్మయంపడన్

మ ం జ రి

సీతను పెండ్లికుమార్తెనుఁ జేయుచు శ్రేయత ముత్తైదువలు
ప్రీతిగఁ బాడిరి కపురంబుల వెల్గించి యపుడు హారతులు.

—o—

# గద్య

శ్రీ రాజ్యలక్ష్మీ సమేత యోగానంద నృసింహ మూర్తి కరుణా కటాక్ష

వీక్షణా లబ్ధ సహజకవితాధురీణ ఆత్రేయస గోత్ర ఆపస్తంభ

సూత్రాంతర్గత మూర్తివంశ పయః పారావార రాకా

సుధాకర రామలింగేశ్వరశాస్త్రి పౌత్ర లక్ష్మీ

నృసింహశర్మ సీతరామాంబికా పుత్ర హరికథా

ప్రబోధకరత్న వేంకటేశ్వరశాస్త్రిచే

రచింపంబడిన సీతారామ చరి

త్రంబున సీతాకల్యాణమను

భాగమున శివధనుర్భంగ

సన్నాహం బను కథ

సంపూ

ర్ణము.



# సీతారాముల  కల్యాణము

కల్యాణి చ- త్రిపుట

ప॥ సీతా రాముల పెండ్లికథను విన్న
  శ్రేయములెన్నో కలుగు—మది ముదంబుఁ బెరుగు

అ॥ శీతాచలపుత్రీ! యీధాత్రీనేతలెల్ల మిథిలేశు పురంబున
  భూతేశుని ధనువును మోపెట్టఁగఁ బూని వచ్చి రంత—గదువింత॥సీ

చ ర ణ ము

జనకుఁ డంత సభా భవనంబున వినుతింపఁగ నగు యాసనంబులను
నునుపఁగఁజేసిశతానందునిఁగనియుత్సాహంబుననక్షతల్ గొనుమనియె॥సీ

వ॥ ఇట్లు జనకుండు సభాభవనంబున శతానందు నుండ నియమించి,
  విడుదుల విడిసియున్న నరనాథుల కాహ్వానంబు లంపి, బలవంతు
  లగు భటులఁ బదివేల నంపి, శంకరు శరాసనంబుఁ దెప్పించి, సభా
  మధ్యభాగంబు నందుంచి నంత

ఉ॥ వచ్చిరి క్షత్రి యోత్తములు బాహువులన్ సవరించుకొంచు, నా
  లచ్చినిఁ గాంచుమంచుఁ, దమ రత్నపు దామము లెన్నొ జూపుచున్,
  మచ్చున కైన లేఁడు నను మార్కొను వాఁడిటనంచు, నందరున్
  ఇచ్చకొలందిఁ బల్కుచు మహేశుని కార్ముక మున్న చోటికిన్

సీ॥ వచ్చి కూర్చుండి రాన్నృపవర్యు లపుడు
జనక భూవరు డుంచు యాసనము లందు
నేను జానకిఁ గొనువాఁడ నే నటంచు
గొప్పగొప్పగఁ బల్కుచుఁ గోవిదులుగ

వ॥ ఇట్లు క్షత్రియు లొక్కరొక్కరు వచ్చినంత

ఉ॥ ముందుగ గాధినందనుఁడు మోదము నందుచు వెన్క లక్ష్మణుం
డంగము రూపమందెనని యందఱుఁ బల్కఁగ వచ్చుచుండ, నా
నందముతోడ సీత యిఁక నాయది యే యను నట్లు రాముఁడున్
సుందర చంద్రురీతి నృపశోభను జూపుచు వచ్చి నిల్చినన్

శా॥ బంగా రందెలు మ్రోఁగఁ బాదయుగళిన్ బాలిండ్లపై నెంతయో
రంగుల్ గుల్కెడు కంచుకంబు వెలుఁగన్ రాణించు వాల్చూపుతో
శృంగారంబగు వారణంపుగతితో శీతాంశు బింబాస్య వ
చ్చెం గల్యాణపు వేదిపై నిలువఁగా శ్రేయంబు దీపింపఁగా

మ ధు ర గీ తి

అంత జనకుండు జననాథులతో ననియెఁ గుతుకంబు నంది
సంతస మందుడు దీనితో ననుచు స్వాగత మిడి కూర్చుండి
యున్న క్షత్రియోత్తము లెల్లరు నమితోత్సాహముతో బొంగి
మిన్నగఁ గరతాళధ్వనులను నా మిన్నున కంద నొసంగి

వ॥ తమ హృదయంబునఁ బొంగువారు యానందంబెల్లరుఁజూపించుచున్న

ఉ॥ అంతట రాముఁగాంచి జనకాత్మజ వంచె శిరంబు, నంతలో
సంతసమంది రాముఁడును జానకిఁ గాంచి ముదంబుఁ బెంచె, నీ
వింతనుఁ గాంచి దాదులును వింతగఁ గూర్చిన పుష్పమాల నా
కంతుని కాంత సోయగముఁ గాంచి హసించెడి సీత కిచ్చినన్

శ్యామ - ఆది

ప॥ మిథిలేశుఁడు తనతనయను జూపుచు మేదినీశులకుఁ దెలిపెనీవిధిని॥మి

అ॥ సదయుత నా పలు కాలకించి యీ శంకరుధను వెక్కిడు జోదున కీ

మి॥ సదయహృదయ యైన సీత విచ్ఛేద శక్తి గలుగఁ జేసినెక్కుఁబెట్టుచు
ముదమున నాసుతపాణి గ్రహింపుఁడు! భూమియందుకీర్తినార్జింపుఁడు॥మి

వ॥ అనిపల్కి జనకుండు సింహాసనంబున నధిష్టించిన క్షత్రియు లొక్క
రొక్కరుగ వెడలి——

సీ॥ అవలీల ధనువెత్తి యవనిజాతను గొందు
ననిపల్కి యొక్కఁడు కని తొలంగె
సీచేతఁగాకున్న నేనుంటినని పల్కి
పట్టుఁబట్టుచు ద్రెళ్ళి పడియె నొకఁడు
క్షాత్రధర్మము నీవు గంగఁ ద్రోసితి వంచు
ధనువుఁ బట్టి యొకండు తల్లడిల్లె
మంత్రబలంబుచే మానుగా విల్లునే
నెక్కు వెట్టెద నంచు నుక్కు మీరి

ఆ॥వె॥ గొణఁగి సోలి యొకఁడు ధనువు లేవక యున్న
తెల్లబోయి సీత నల్లఁజూచి
అరుగలేక యున్న నధిపులెల్లరు నొక్క
పెట్టు నగిన శిరము నట్టె వంచె

వ॥ ఇవ్విధంబున ధరావరులు తల్లడ మందుచున్న

చం॥ జనకుఁడు చూచె మౌని ముఖసారసమున్, మునికాంచె రాము, త
మ్ముని గని రామ భూవరుఁడు మోడ్గదల్చి, ధనస్సు నిచ్చి, యా
మునివరు మంతనమ్మునఁ బ్రమోదము పొంగఁగ సింహమట్లు ముం
దున కరుదెంచె, నాజనకు నుండి కుతూహల మెంతొ వెల్వడన్

వ॥ అంత వచ్చు శ్రీరామమూర్తిం గాంచి కొందరిట్లు తలంప సాగిరి

ఉ॥ ఎవ్వఁడొ యీతఁ, డీధనువు నేవిధి నెత్తఁగలాఁడొ, యిందులన్
నవ్వులపాలుఁ గా గలఁడు, నాతినిఁ గైకొనలేఁడు, కుఱ్ఱడై
క్రొవ్వున ముందువచ్చు సతిఁగోరుచు, నీడును గానరాదు, పెం
డ్లివ్విధి యంచు క్షత్రియు లనేకముగాఁ దలపోయు చుండఁగన్

కేదారగౌళ - ఆది

ప॥ గురువరు కనులకు హరికిశోరమటు ధరణీసుత కనుల కనంగుని యటు

అ॥ ధరణీవరులకు బాలకునియట్లు గిరిధరుగతి నాజనకరాజునకు

చ॥ సరసిజేక్షణుండగు శ్రీరాముఁడు శంకరు మదిముద మొదవందలంచుచు
సురవరులునుకిన్నరుల్ పొగడఁబడసరసీరుహామునుముందునకిడియెనుఁ॥గు

వ॥ ఇట్లు శ్రీరాముండు ధనువుకడకు వచ్చుచున్న నాసభికులు

సీ॥ ఈబాలకుఁడు ధను వెక్కుఁ బెట్టకయున్న
నొప్పు సీతకటంచు నొకఁడు మరియు
ఎక్కుపెట్టఁగ లేక యేగతి నరుదెంచు
నని పల్కు నొక్కరుం డద్భుతముగ
ఈబాలకుని శక్తి నెవ్వ రూహింపంగఁ
జాలరం చొక్కండు నేలఁ జూచు
కాదు కాదిఁక క్షాత్రగౌరవంబును నిల్పు
దేవదేవుఁడె వచ్చెఁ గేవలముగ

గీ॥ ననుచుఁ, గాంచుచు నుండ, నాయజునిపౌత్రు
డంత శంకరుకార్ముకం బరసి, నిలిచి,
మంతనంబున గౌరీశు సంతసమున
నెంచి నుతియించె నిట్లు సమంచితముగ

మేచకల్యాణి - చతురశ్ర

ప॥ దేవదేవ! నీ పావననామము దీనజనుల రక్ష—పాపజనులశిక్ష ॥దే॥

అ॥ కేవలముగ నీ పదదాసుఁడనై సావధానముగ ధనువుయెూపెట్ట

చ॥ భావమందు సంకల్పించితినో భావభవహరణ! మానినుతచరణ!
ఏవిధంబునను నను కృతకృత్యుని గావించెదవో మహాదేవ శంభో!॥దే

వ॥ ఇట్లష్టమూర్తి ననేకవిధంబుల స్తోత్ర మాచరించి

ఉత్పలమాలిక

కౌశికు కాయరోమములు గగ్గురుపాటునుఁ జెందు నట్లుగా

నాశివచాపమెత్తి, జనకాత్మజ సంశయ మంత దీరఁగా
భాసురలీల నూపి, స్థిరభావము తోడుత నారి లాగ? నా
కాశము భేదిలన్, రవి చికాకుఁబడన్, నృపలోకమంత లో
నాశలువీఁడి చూడ, జనకాధిపు డచ్చెరువంద, సీతయం
దాశలు పెంపుఁజెందఁగను, నాభృగునందను గర్వభంగమై
శ్రీశుని కీర్తి చంద్రికలు చిత్రత ధాత్రినిఁ జిందులాడఁగా
నా శివచాపమున్ విరిగె నాశ్రితవత్సలుఁడైన రాముచేన్

మ ధు ర గీ తి

శంకరు కార్ముకమున్ విఱిచిన యాశశివదన సీతకాంచి
శంకవీడి శ్రీరాముగళంబున చక్కనిమాలనువైచి
అలరుదినము సౌమ్య మాఘ మందున అమావాస్యయై వెలసె
అలఘు విక్రముం డౌ శ్రీరాముని ఖ్యాతి ధరణిపై నిలిచె

ఉ॥ పూవులమాల దాశరథి భూరిగళంబున సీతవైవ, నా
భావము నిన్నుఁగోరఁగను బాపురె? ఏడితివం "సిగ్గు" నే
నేవిధినైన నుండ నని ఈర్ష్యతఁజెందుచు "కీర్తికాంత" యున్,
భూవిభులందు పెద్దదియు పూనిక దిక్కులకేగెఁ గీర్తియున్

కం శ్రీరామునిపై సురవరు
లారూఢిగ కుసుమములను నయ్యెడఁగురియన్
కారణకారణుఁ డనుచును
సారణులున్ సిద్ధవరులు జక్కఁగఁ బలుకన్

ధన్యాసి - ఆది

ప॥ శ్రీకరమగు సౌమ్యఫాల్గుణంబున శ్రేయస్కరమాశుక్లపక్షవిదియను
అ॥ సాకేతంబున కాశ్రితులతోడ జనకుఁడు శుభలేఖల నంపించిన
చ॥ ప్రాకటముగ వనభూముల నడచిసాకేతంబునుఁ జొచ్చి యష్టమిని
నాకపాలకుని గతి యలరెడి యా నరనాథుని పూజలందినిలిచిరి॥శ్రీ॥

చ ర ణ ము

సవినయముగఁ బూజలంది, బ్రాహ్మణులవిరళముగ నాశిస్సులనిడి,శుభ
నివహాము లగు లేఖలందించి, సభ నిస్తులమగు కట్నంబులఁగైకొని

భవరహితుల పెండ్లిమాట లెల్లను పట్నంబున వెల్లడిఁ గావింపఁగ
నవనీ నాథుని కెఱుక పఱచి యా శివనామామృత మందుచుండిరా॥ శ్రీ

వ॥ అంత నా దశరథుఁడు పురంబలంకరింప మంత్రుల కాజ్ఞసేసి, ఇంద్రపు
రంబునకన్న మిన్నగాఁ జేయించి, సకల బంధునివహంబులరావించి,
వంది గాయక వైతాళికులు జయంబువలుకనర్తనాంగనలునాట్యంబు
సేయ,వేదవిదులగు విప్రోత్తములు మంత్రంబుల నాశీర్వదింప,
నాదస్వర శృంగభేర్యాది రవంబు లాకసంబున కంట, సువాసినులు
సేసలుచల్లుచునివాళులీయ,మంత్రీసామంతులు వెంటరా, పురోహితుం
డగు వశిష్ఠుండిష్టగోష్ఠి సల్పుచుండ, భరతశత్రుఘ్ను లిరువంకల
నంకబులం దధిష్టింప, నలంకారంబున నల్కాపురిం ధిఃక్కరించు
అయోధ్యాపురంబునుండి మహావైభవంబున పంక్తిరథుండు బయలు
వెడలి, యరణ్య మధ్యంబునం దనేక చిత్రవిచిత్రంబులం జూచుచు,
మార్గసౌకర్యంబునకై జనకుం డమర్చినజలయంత్రంబులతంత్రంబుల
నందందం గాంచుచు. చలువపందిళ్ళ నీడల విశ్రమించుచు, క్రూర
మృగంబులయ్యు వారిసాత్త్వికంబుల వెలిపుచ్చు నాశ్రమంబుల సంచ
రించుచున్న మృగంబులతో నున్న మునితండంబులం గాంచుచు,
సౌమ్యనామక వత్సర ఫాల్గుణ శుద్ధ ద్వాదశీ దినంబున మిథిలాపురిం
బ్రవేశింప,జనకుండమందాయమానమానసుండై యెదురరుగుదెంచి,
గౌరవంబుగాఁ గొంపోవుచున్న,మార్గంబునం దచ్చటచ్చటచిత్రతరం
బగు శిల్పచాతుర్యంబుం గని, జనకధరాధినేతయైశ్వర్యంబున కచ్చెరు
వంది, యొక్కచో వెలింగింప నంతట నొక్కపరి వెలుంగు దీపంబులఁ
బరీక్షించి వీధుల నడుమ నెడఁగాన్పించుయూపస్తంభంబులకమర్చిన
వజ్రవైడూర్యాది రత్నంబులఁ దిలకించుచు, మది ముదంబంద నేగి,
తమకై నిర్ణయించు విడిది గృహంబులఁ బ్రవేశించి, యారాత్రి భో
జనాదులఁ గావించి సుఖంబుండి, "మరునాఁ డరుణోదయమ్మున"-

మంజరులు

కాలకృత్యముల నెర వేర్చిన యాకైకేయీ తమ్ముండు
శీలవంతులౌకాంతల తోడ నశేషముదంబున నిండు

కన్న దశరథునిఁ జేరి నిలువఁగా కూర్చుండఁగ నియమించి
విన్నవించె దశరథుఁడు గురువుతో వేగిరముగఁ గృతమొంచి
తెలుపు మనఁగ నా బ్రాహ్మణోత్తములను దీనజనులఁ బిలిపించి
విలువగలుగు వస్త్రదానములతో విపులమౌ ఖ్యాతిఁ బెంచి
నాందీశ్రాద్ధముఁ జేయించుచు నా నాఁడు దశరథునితోడ
బృందారక వందితుఁ బూజలు చేయించెఁ గడుఁ గూర్మితోడ

కం॥ స్నాతకమును జేయింపఁగఁ
పూతచరిత్రుఁడు వశిష్ఠ భూమీసురుఁడున్
బ్రీతిగ దశరథుఁ బిలచుచు
ఆతతమతి జనకునొద్ద కనిపెన్ దూతన్

ఉ॥ అంతఁ జతుర్దశీతిథి నరాధిపుఁ డాముని యాజ్ఞనంది భా
స్వంత కులప్రదీపుఁ గను వాంఛను జేరి, సుసాధ్వి నూర్మిళన్
సంతసమొప్పఁగాఁ గొనుడు సర్వసులక్షణలక్షితుండు నై
కంతుని మీరు లక్ష్మణుని కాంతగ నంచు ముదంబుతో ననెన్

వ॥ అదియునుం గాక నాతమ్ముం డగు కుశధ్వజుని కుమార్తెలున్నారు

మ ం జ రు లు

బావా మాండవి శ్రుతకీర్తులఁ గొను భరత శత్రుఘ్నులకిఁక
సావధానముగ నాలోచింపుము సత్యంబును వేరనక
అని పలికెడి జనకుని వాక్యంబుల కలరుచు నా దశరథుఁడు
చనవమరగ సమ్మతిఁ దెల్పఁగఁ దన సదనముఁ జేరె జనకుఁడు

కం॥ అంత శతానందుఁడు మది
నెంతయొ కుతుకమున దశరథేశ్వరుతోడన్
కంతుని జనకుఁడు రాముఁడు
దంతిగమన లక్ష్మి సీతఁ దలపుమి యనియెన్

చం॥ కొమరులు ముగ్వురన్ వారినిఁ గోరిన శేషుఁడు, శంఖ, చక్రముల్
విమలగుణాఢ్య ధన్యుఁడవు పెంచఁగఁ గల్గితివయ్య! నేడు నీ
యమరనుతున్ సహోదరుల నంతయు నీయదె పుణ్యమయ్య! యో
సమరసభావయుక్త! గొను సర్వసుపర్వులు మెచ్చు కీర్తినిన్

వ॥ అని యాతని యొక్కయు కౌసల్యా కైకేయీ సుమిత్రల యొక్కయు పూర్వజన్మవృత్తాంబుల నెఱుకఁజేసి యేగ, నిట వశిష్ఠుండు స్నాతక వ్రతంబు పూర్తి గావించి సుఖంబుండ మఱునాఁడు శతానందుం డానందంబున జనకునింట

ఉ॥ ద్వాదశమాస పూర్ణిమను దాను ముదమ్మున సీత పెండ్లికై వేదికఁగూర్చి, యాజనకు వేగిరపెట్టుచు, నచ్చటచ్చటన్ భూధవులెల్ల వింతపడ భూరితరంబగు వాయుయంత్రముల్ సేదలుదీర్ప నుంచి బహు లీలలొనర్చుచు నుండ నంతటన్

ఉ॥ చక్కని వాద్యఘోషములు, సానులయాటలు, తోరణంబులున్ మక్కువఁగొల్పుచుండ నయమార్గులు తాపసు లెంపటెందఱో చక్కని మంత్రముల్ చదువ, క్షత్రియ పుత్త్రిలు, రాచ కామినుల్ గ్రక్కున పెండ్లివారిఁ గొని రా నరుదెంచిరి ప్రేమ తోడుతన్

భైరవి - చ॥ త్రిపుట

ప॥ పెండిలివారినిఁగొనిపోఁజేడులపిండుయరుదెంచఁగా-దశరథుండు వేగ॥ పె

అ॥ మండితయశుఁడు వశిష్ఠు నాజ్ఞ చే రండని పిల్వఁగఁ బెండ్లిపదార్థము

మి॥ లుండఁ జేసె పళ్లెరంబు లందున నిండు వేడ్క ముత్తైదువ లెల్లరు దండిగ మంగళహారతు లివ్వఁగ చండకిరణ వంశ మండితులగు నా॥ పెం

వ॥ వలయు పదార్థంబులం గొని పరిచారికా గణంబు వెంట నడువ, వారణంబుల నధిష్ఠించి, రామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు వంది మాగధ జనంబులు సందడిఁ జేయఁ బెండ్లి యిల్లు సేర శతానం దుండు వారి వివాహవేదిక నెక్కించి, బంధుమండలిఁ గూర్చుండ నియమించి, పెండ్లి కుమార్తెల రావించి వివాహంబు జేయింప నుపక్రమించి, జనక కుశధ్వజుల బిలిపించి ——

బిలహరి - చతురశ్ర

ప॥ జనకకుశధ్వజులతో పురోహితుఁడు జరిపించెను కన్యాదానంబును॥

అ॥ వినయముగానల్వురుకూతుండ్రనువినుతయశులైనరవికులతిలకులకు॥ జ

చ ర ణ ము

తాళిఁగట్టించెఁ గ్రమముఁ దప్పకయె ధన్యుండగు నావశిష్ఠ సన్మౌని
మాలిమితో జ్యోతులు వెలిగింపఁగ
మస్తకంబు లందు —— పోసికొనిరి తలఁబ్రాలు ముందు ॥జ॥

౨ మూడవనాఁడు సదస్యంబని తా లాడూలనుఁ జేయించెన్–జనకుఁడు
నాలవనాఁడే పెండ్లి కుమారుల నలువుర విడుదుల కంపించె జేఁడు॥జ

వ॥ ఏనవనాఁడు నాగవల్లిఁదీరిపింప

చం॥ విడిది గృహాప్రవేశ మను వేడుకఁ దీరిచి నంత నల్వురున్
విడివడి మానులందరికి వేడుకతోడ నమస్కరింపఁగాఁ
గడువడి గాధినందనుఁడు గాంచి త్రిపీడలు వచ్చునంచు సం
దడిగను దీవనల్ సలుపఁ దప్పని కొండ రసహ్య మందఁగన్

వ॥ వారలం గాంచి విశ్వామిత్రుండు

శ్లో॥ ఆసనే పుత్త్రిపీడాచ । బంధుపీడాచ భోజనే
శయనే భర్తృపీడాచ । త్రిపీడాస్తు దినేదినే

వ॥ అని తెలిపి అష్టమినాఁడు దశరథునకు పుత్త్రికుల నప్పగించి సుఖంబుండు డని, దపంబొనర్పనేగె. ఇట ఫాల్గుణకృష్ణపక్షదశమి దినంబున జనకాదులు దశరథాదుల రావించి, యొక్కచోఁ గూర్చుండ నియమించి, శ్రీరాముండాది జామాతలకుఁ దమ పుత్త్రికల నప్పగించుచు నిట్లుదెల్పిరి——

దేవగాంధారి - ఖండగతి

ప॥ మాబాల లెప్పుడైన నేబాలికలతోడ
నేబజారునకైన నేగలేదయ్యా! ॥మా॥

అ॥ ఏభాగ్య మెట్లున్న సౌభాగ్యముగ మీరు
ఈసడింపక కాపురము సేయఁగోరెదము ॥మా॥

చ ర ణ ము

ధరణిలో వేదాద్రి పురనిలయుఁ డైనట్టి
నరకేసరియె మీకు నన్ని సుఖములఁ గూర్చు

దురితదానవహరుని స్మరియించి సతతంబు
కరుణఁ బొందుఁడు మీరు కల్యాణమయముగా ॥మా॥

వ॥ అని బాలికల నప్పగించుచు శ్రీరామునికడ కేగి సీతకరపల్లవంబును
రాము హస్తము నందుంచి జనకుండు—

శ్లో॥ ఇయంసీతా మమసుతా సహధర్మచరీతవ
ప్రతీచ్ఛ చైనాం గృహ్ణాంతే పాణిం గృహ్ణీష్వ పాణినా

వ॥ ఇట్లు జనకుండు శ్రీరామునకు బల్కి కూతుండ్రం గాంచి

ఉ॥ అత్తలు మువ్వురుం గలుగ నార్యుఁడు మామ యొకండు వారితో
మెత్తనివార లీరలని మేలగు వాక్యము విన్ననాఁడె మా
హృత్తల మెంతో సంతసిలు, హోమ మదెంతగ నున్న నేమగున్,
చిత్తము ఖేదమందుఁగద! క్షేమము ఖ్యాతి విరోధ మైనచోన్

వ॥ అని పుత్రికలకుఁ దెల్పి దశరథ కౌసల్యాదులం దిలకించి కరములు
ముకుళించి—

ఉ॥ చిన్నతనంబునుండియును జేయఁగఁరానివి చేయ రెన్నఁడున్
మన్ననతోడఁ బెంచఁడిఁక మాయెడ లోపము లెంచకుండ, మీ
కున్నది కీర్తి ధాత్రి యని యొప్పగ నిచ్చితి బిడ్డలన్, సదా
కన్నుల రెప్ప లట్టులను గావుఁడి ప్రేమను సర్వకాలమున్

వ॥ అని యప్పగించి విదేహాధీశ్వరుండు సువర్ణ రత్న భాండాగారంబుల,
దాస దాసీజనంబులఁ గూతుండ్ర కరణంబొసంగి, రథ, గజ, హయ,
భట వర్గంబుల నల్లుండ్ర కిడి, యనిపి, యిట సుఖంబున్న, దశ
రథుండు పుత్రులతోడను, కోడండ్రతోడను, మహానందంబున
బయలువెడలి దశమిదినంబున మార్గమధ్యంబున నడచుచుండ
భార్గవరాముండు పథంబున కడ్డువచ్చి శ్రీరాముని గాంచి యిట్లనియె

కాంభోజి - రూపకము

ప॥ ఓరీ! భార్గవరాముఁడనొకఁడను నే నుండఁగ ॥నో॥

అ॥ శ్రీరాముఁడవా? నీవు ఛీఛీ యెంతటి తులువవు ॥ఓ॥

చరణము

సీతామాలి నీజనకుఁడు నే సహదెంచఁగ సమరము
చేతఁగాక స్త్రీలనఁడుమ స్త్రీవేషము చేత నిలిచె ॥నో॥

౨ వానికి సుతుఁడవు నీవై పూనిక నా నామం బిం
తేని సంశయంబు లేక యేఁగతిఁ గొని నిలిచినావు ॥ఓ॥

వ॥ అని పలికిన శ్రీరాముండు నతశిరస్కుండై ధరణీబృందారకునిఁ
గాంచి——

సీ॥ తండ్రి కోరికఁ దీర్పఁ దల్లిని దునుమాడి
మాతను వెండియు మనిచినావు
అల శంభునింజేరి యఖిల విద్యలనేర్చి
యవనిలో సత్కీర్తి నందినావు
గండ్రగొడ్డలిఁ బూని గడగడ లాడించి
క్షాత్ర వర్గము నేలఁ గలిపినావు
సర్వజ్ఞుఁడైనట్టి సర్వేశ్వరుం గూర్చి
స్థిరబుద్ధిఁ దపమును జేసినావు

గీ॥ అట్టి జెట్టివి నీ కెవ్వఁడగును జోడు
తుట్ట తుద కిట్టు ననుఁ బట్టి యిట్టు లాడ
సవ్యముగ నుండ దోయయ్య! అవ్యయుఁడవు
కానఁ గొను మింక నా నమస్కార మిపుడు

వ॥ అని నమస్కరించు శ్రీరామునిఁ గాంచి పరశురాముండు

ఆ॥వె॥ పరమశివుఁడు త్రుప్పపట్టి నీధనువంచు
విడువఁదాని నెత్తి మిడిసిపడెదు
ఇదిగొ ధనువు దీని నెత్తఁగా దిట్టవై
కీర్తిఁ గాంచు ధరను బూర్తిగాను

మంగళము

విజయం బను ధను వందించిన శ్రీవిభుఁడు దానిఁ జేనంది
ద్విజు నందుండిన సర్వశక్తులను దివిజులు మెచ్చఁగఁ బొంది

బాణ మొండు సంధించి నిలువఁగా భద్రత భృగురాముండు
నేను నిలుపు నరనాథుల శిరముల నింకఁ గూల్పు మనవుండు
శ్రీరాముం డటుచేసి నిలువఁగాఁ జిద్రూపునిఁ బరికించి
నే రాముఁడనని గర్వమందితిని నిజము గాదనుచు నెంచి

వ॥ నిజముఁదెలిసి భార్గవరాముఁడు దాశరథిం గాంచి వినయవినమిత
గాత్రుండై.

సీ॥ సరసిజేక్షణ! నిన్ను సన్నుతించుచు గర్వ
మందు నారదు గర్వ మణఁచినావు
పరమేశ్వరుఁడు పుష్పశరునిఁ గూల్చితి నంచు
గర్వింపఁగా వానిఁ గలఁచినావు
వేదమాతను బట్టి విఱ్ఱవీగెడి దైత్య
వర్యునిన్ బడఁగూల్చి వఱలినావు
లోకలోకంబులన్ లోఁబఱచిన యట్టి
కనకకశిపుఁ గూల్చఁ గనలినావు

గీ॥ గర్వమందెడి వారిలో గర్వమడిపి
సర్వసమ భావమున్ గూర్చు జాణవీవు
నాకు జ్ఞానంబు దయఁజేసి నావు నేఁడు
రామ! శ్రీరామ! రఘురామ! రామ! రామ!

కల్యాణి - చ॥ త్రిపుట

ప॥ పూసవంశోద్దీప! భూపా! ॥పూ॥

అ॥ భాషాపతిముఖ స్తోత్ర పాత్రా! ॥పూ॥

చ ర ణ ము

భవభయ వారణ! పాలిత మునిజన!
రవి శశి నయనా! రాక్షస మాననా! ॥పూ
శివనుత చరణా! శేషాహి శయన!
పవిత్రగుణగణ! పాలించు తలఁపున ॥పూ॥

వ॥ ఇట్లనేక విధంబుల స్తోత్రమాచరించి, కౌశల్యానందనుని వలన సెలవుఁ గైకొని మహేంద్ర శైలంబునకు తపంబు సేయ నరుగ నాటినుండి, యేడు దినంబులు ప్రయాణ మాచరించి యెనిమిదవ నాఁ డయోధ్యాపురంబుఁ బ్రవేసించి——

గీ॥ అంచితమ్మగు సాధార ణాబ్ద మందు
చైత్ర శుక్ల ద్వితీయను జనకసుతను
గలిసి సాకేత పట్టణ నిలయుఁ డయ్యె
రామభద్రుండు భక్త సంరక్షకుండు

మ ధు ర గీ తి

దంపతు లందరి వరుసగ నుంచుచు దంతిగమన లావేళ
సొంపగు పాటలఁ బాడి రిట్లులను శోభస్కరమా లీల

శ్రీరాగము . ఆదితాళము.

మంగళహారతి శ్రీరాములకు శృంగారంబగు సీతామాయికి
భృంగపంక్తివలెరంగుగ వెలిఁగెడి ముంగురులుగల్గుఅంగనలొసఁగెడి॥మం

చ ర ణ ము

ధరణిలో కన్నెపేటి పురవాసుండై ధరణీశురుఁ డగు వేంకటేశ్వరుఁడు
సురుచిరముగ వెలిగించి రొసంగు కప్పురంపు జ్యోతుల నలరుచుండు ॥మం

...o...

# గ ద్య

శ్రీ రాజ్యలక్ష్మీ సమేత యోగానంద నృసింహ మూర్తి కరుణా కటాక్ష

వీక్షణా లబ్ధ సహజకవితాధురీణ ఆత్రేయస గోత్ర ఆపస్తంభ

సూత్రాంతర్గత మూర్తివంశ పయః పారావార రాకా

సుధాకర రామలింగేశ్వరశాస్త్రి పౌత్రి లక్ష్మి

నృసింహశర్మ సీతరామాంబికా పుత్ర హరికథా

ప్రబోధకరత్న వేంకటేశ్వరశాస్త్రిచే

రచింపంబడిన సీతారామ చరి

త్రంబను హరికథాగాన ప్రబం

ధంబున సీతాకల్యాణ

మను క థ

సం పూ

ర్ణము.



బాపూజీ ఆర్టు ప్రింటర్సు, జగ్గయ్యపేట.

ఈ గ్రంథమాలనుండి వచ్చిన పుస్తకములు

1. కర్మాబాయి చరిత్ర హరికథ
2. శ్రీ లక్ష్మీనృసింహస్తుతి మంజరి
3. శ్రీ రాజ్యలక్ష్మీ కల్యాణము హరికథ
4. శ్రీమచ్చంద్రహాసచరిత్రమను హరికథ

(పై నాలుగు) మార్తి లక్ష్మీనృసింహశర్మగారివి

మార్తి వేంకటేశ్వరశాస్త్రిగారి అచ్చునకు సిద్ధముగనున్న గ్రంథములు

1. శ్రీలక్ష్మీనృసింహ నక్షత్రమాల
2. శ్రీ అనంత నక్షత్రమాల
3. శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యము హరికథ
4. ప్రభాకర శతకము
5. నృకేసరి శతకము

మార్తి లక్ష్మీనృసింహశర్మగారి గ్రంథములు అచ్చునకు సిద్ధముగానున్నవి

1. శ్రీ రాజ్యలక్ష్మీ పరిణయము హరికథ
2. భక్త కన్నప్పయను హరికథ
3. సీమంతినీపరిణయమను సోమవారమహాత్మ్యము హరికథ

శ్రీ యోగానంద నృసింహ గ్రంథమాలవారి గ్రంథములు

1. ధనలక్ష్మీ వ్రతకల్పము
2. లక్షబిల్వార్చనకల్పము
3. రంగనాయకి స్తోత్రము
4. చెన్నకేశవ స్తోత్రము
5. భగవద్గీత

ప్రాప్తిస్థానములు

**మార్తి వేంకటేశ్వరశాస్త్రి**

కన్నెవీడు (వయా పెనుగంచిప్రోలు) కృష్ణాజిల్లా

**భైరవభొట్ల వేంకట్రామేశ్వరశర్మగారు**

పెనుగంచిప్రోలు. కృష్ణాజిల్లా